"సాంప్రదాయ సిద్ధ
భారతీయ ఔషధా
ప్రత్యేకమయిన శ
ఉదాహరణకి, అమ




ప్రకృతిలో లభించే అత్యంత శక్తివంతమయిన పది మూల ఔషధాలతో అ
తయారు చేయబడుతోంది. అంటే అమృతాంజన్ చాలా శక్తివంతమయినది.
అందుచేత అమృతాంజన్ తలనొప్పులకు, జలుబులకు, వంటినొప్పులకు,
బెణుకులకు శీఘ్రంగానూ, నిశ్చయంగానూ ఉపశమనం కలిగిస్తుంది.
అంతేకాదు అమృతాంజన్ సురక్షితమయిన బాధా నివారిణి.

అమృతాంజన్ : 80 సంవత్సరాలకు
పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము

# అమృతాంజన్

**తలనొప్పులకు .జలుబులకు.
వంటినొప్పులకు.బెణుకులకు**






# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళ కథ [''అచ్చిరాని వర్తకం''] రచయిత్రి ఎస్. అరుణా శ్రీనివాస్.

ఆదికాలంలో వైశ్యులు వ్యవసాయమూ, పశు పోషణా చేసేవారు. అప్పటి నాగరికతలో ఆర్థికమైన వనరులు ఆ రెండే. సంఘంలో ఇతర ఉత్పత్తులు పెరిగినాక వారు వర్తకంలోకి దిగారు. వారి మొదటి వ్యాపకాలు ఇతర వర్ణాలవారి పరం అయాయి.

## అమరవాణి

అత్యల్ప మపి సాధూనాం శిలాలేఖేవ తిష్ఠతి,
జలలేఖేవ నీచానాం యత్ కృతం తత్ వినశ్యతి.

[సత్పురుషులు చేసేది ఎంత కొంచెమైనా శిలాక్షరాలలాగా నిలిచి ఉంటుంది. కాని నీచులు చేసేది నీటివ్రాతలాగా ఎప్పటి కప్పుడే చెరిగిపోతుంది.]

సంపుటి 65 నవంబర్ '79 సంచిక 5

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా ; 15-00






త్రిపురారి సత్యనారాయణ, టేకి.

ప్ర: పాలు శాకాహారమా? లేక మాంసాహారమా?

స: ఆహారాలను వృక్ష సంబంధమైనవిగానూ, జంతు సంబంధమైనవిగానూ విభజించినప్పుడు పాలు జంతు సంబంధమైనవి. అలా కాక, ఆహారాలను హింసద్వారా లభించేవిగానూ, హింస లేకుండా లభించేవిగానూ విభజించినప్పుడు పాలు అహింసద్వారా లభించే ఆహారమే అవుతుంది. మన దేశంలో శాకాహారులమని చెప్పుకునేవారు హింసనే పాటిస్తారు. వారి దృష్టిలో పాలూ, వెన్నా, నెయ్యీ, మీగడా, పెరుగూ లాటివి శాకాహారం కిందికే వస్తాయి. కొందరు కోడి వగైరాల గుడ్లను కూడా శాకాహారమే అంటున్నారు. కారణం వాటిలో జంతుసహజమైన అంగనిర్మాణమూ, నరాలూ, రక్తప్రసారమూ వగైరాలు ఉండవు గనక. కాని అమెరికాలో "వెజిటేరియన్స్" అని చెప్పుకునేవారు ఏ జంతు సంబంధమైన ఆహారాన్నీ ముట్టరు. ఆఖరుకు లివర్ ఎక్స్ట్రాక్ట్‌ను మందుగా తీసుకున్నవాడు కూడా వారి లెక్కన "వెజిటేరియన్" కాడు. గాంధీనీ, బెర్నార్డ్ షానూ వెజిటేరియన్లుగా గుర్తించటానికి వారు నిరాకరించారు.

ఎస్. ఎల్. ఎన్. మూర్తి, భిలాయ్‌నగర్.

ప్ర: బుద్ధుడు అహింసావాది. అయినప్పటికీ బౌద్ధులలో చాలామంది మాంసాహారులెందుచేత? బుద్ధుడే స్వయంగా మాంసాహారం తిని తెచ్చుకున్న రోగంతో చనిపోవటం ఎలా జరిగింది?

స: బౌద్ధం శాకాహారాన్ని ప్రచారం చెయ్యలేదు, అహింసనుమాత్రమే ప్రచారం చేసింది. శ్రీలంక, బర్మా, చీనా, జపాను, ఇండోచీనా, కొరియా వగైరా దేశాలలో బౌద్ధం ఈనాటికీ నిలిచి ఉన్నా ఈ దేశాలలోని బౌద్ధులు నియమంగా శాకాహారులు ఏనాడూ కారు. అయితే బౌద్ధులు జీవహింస చేయరాదు, మృగాలను చంపరాదు. బుద్ధుడి ఆ జన్మవైరి అయిన దేవదత్తుడు తన నియమాలు కొన్ని ఆమోదించమని బుద్ధుణ్ణి కోరాడు. అందులో బౌద్ధులు శాకాహారులు కావటం ఒకటి. దానికి బుద్ధుడు ఒప్పుకోలేదు. బౌద్ధులు తిండి అడుక్కుంటారు. వారికి కబళం వేసేవారు శాకాహారులు కావాలని శాసించే అధికారం తనకు లేదన్నాడు బుద్ధుడు. మన దేశంలో శాకాహారం వ్యాప్తి చేసినవారు జైనులు. జైనుల ప్రభావం లేనిచోట–కాశ్మీరులో లాగా–బ్రాహ్మణులు కూడా మాంసాహారులే.



## 77

సహస్రబుద్ధీ, శతబుద్ధీ, ఏకబుద్ధీల కథ విని అతిలోభి, "నువు చెప్పినది నిజం కాదు. ఇందులో విధినిర్ణయం ఏమీ లేదు. ఏకబుద్ధి లోకజ్ఞానం కలది గనక బతికి బయటపడింది. మిగిలిన ఇద్దరికీ అలాటి జ్ఞానం లేకపోయింది. అంతేగాక దురాశ వల్ల కలిగే దుష్ఫలితాలు "కోతి ప్రతీకారం" అన్న కథలో స్పష్టమవుతాయి," అని ఆ కథ ఇలా చెప్పాడు:

ఒకప్పుడు చంద్రుడు అనే రాజు ఉండేవాడు. అతని కుమారులకు కోతులతో ఆడుకోవడమంటే చాలా సరదా. అందుచేత వాళ్ళు తినుబండారాలు ఇచ్చి అనేక కోతులను రాజప్రాసాదంలోకి చేర్చారు.

కోతులు తిండి బాగా మెక్కి, కొవ్వుపట్టి, రాజభవనం ఆవరణకు బాగా అలవాటు పడ్డాయి. వాటికి నాయకుడైన ముసలికోతి బృహస్పతీ, చాణక్యుడూ లాటి రాజనీతి కోవిదుల రచనలు క్షుణ్ణంగా చదివి, వైద్యమూ, పశువైద్యమూ కూడా నేర్చుకున్నది.

రాజుగారి ఆవరణలో ఒక గొర్రెపొటేళ్ళ మంద కూడా ఉండేది. వాటి మీద చిన్నపిల్లలు సవారి చేసేవాళ్లు, వాటిలో ఒక గొర్రెపొటేలు తిండిపోతు. అది అవకాశం దొరికినప్పుడల్లా వంటసాలలో జొరబడి, అక్కడ ఉన్నదంతా తినేసేది. వంటవాళ్ళు మండిపడి, చేతికి ఏది దొరికితే అది పెట్టి దాన్ని కొట్టేవాళ్లు, వంటకట్టె అయినా సరే, కుండ అయినా, కంచు పాత్ర అయినా సరే!

ఇదిచూసి కోతులనాయకుడు ఇలా అనుకున్నది: "గొర్రెపొటేళ్లకూ, వంటవాళకూ, మధ్య రంధి వల్ల కోతులకు అపాయం.



ఈ పాటేలుకు వంటకాలంటే ఇష్టం. అది చూసి వంటవాళ్లు మండిపడి, ఏది పడితే అది తీసుకుని దాన్ని కొట్టుతున్నారు. యాదృచ్ఛికంగా వాళ్ళ చేతికి మండే కట్టె దొరక వచ్చు. అది పెట్టి కొట్టారంటే, గొర్రెపాటేలు బొచ్చు అంటుకోవచ్చు. అది పరిగెత్తిపోయి, గుర్రపుసాల మూలలో ఉన్న తమ పాకలోచేరి, మంటలకు తట్టుకోలేక నేలమీద ఎండు గడ్డిలో పొర్లవచ్చు. గడ్డి అంటుకుని, గుర్రపు సాలల మీది రెల్లుకప్పు మండవచ్చు. రాజుగారి జాతిగుర్రాలలో కొన్ని చావు తప్పి, కాల్పులతో బయటపడినా, మరి కొన్ని చచ్చి తీరుతాయి. గుర్రాలు కాలి బొబ్బలెక్కితే, కోతులను అప్పటికప్పుడు చంపి, వాటి కొవ్వు పట్టించటం చికిత్స అని శాలిహోత్రుడి వంటి పశువైద్య శ్రేష్ఠుడు చెప్పాడు. కోతి కొవ్వును కాలుడు గాయాల మీద మందంగా పట్టిస్తే, వెంటనే నొప్పి తీస్తుందట. తన జాతిగుర్రాలు కాలి, బొబ్బలెక్కి ఏడుస్తూంటే రాజు గారు ఆస్థాన పశువైద్యుడి సలహా తప్పక అడుగుతాడు. ఆయన ఎలాగూ ఈ చికిత్సే చెబుతాడు. రాజుగారికి గుర్రాలు ఎక్కువ గాని, కోతులంటే ఏం లక్ష్యం? ఆయన కోతులన్నిటినీ చంపించి, తగినంత కోతి కొవ్వు తీయించి, గుర్రాలన్నింటికీ చికిత్స చేయిస్తాడు. ఇదంతా తప్పక జరిగి తీరుతుంది. అందుచేత నా కోతులను రక్షించుకోవటం నా విధి. అందుకు తగిన చర్యలు ముందే తీసుకోవటం మంచిది.''

అది తన కోతులన్నిటినీ సమావేశపరిచి, వాటికి రానున్న ఆపద వివరించి చెప్పింది. చివరకు అది కోతులను ఇలా హెచ్చరించింది:

''పాటేలుకూ, వంటవాళ్ళకూ మధ్య సాగుతున్న రంధి, నేను చెప్పినట్టు, మనకు ప్రమాదకరం. నాలుగు కాలాల పాటు బతకదలచిన వాళ్లు సంఘర్షణ పడేవాళ్ళ మధ్య ఉండరాదు. సంఘర్షణలతో పచ్చ పచ్చని రాజ్యాలు భగ్గు

మంటాయి. దుర్భాషలు దీర్ఘ కాల స్నేహాలను కూడా తుడిచి పెడతాయి. కానిపనులు ఎంతటి కీర్తికీ కళంకం తెస్తాయి. అందుచేత నేమిటంటే, ఆపద వచ్చి పడకముందే మనం మన అరణ్యానికి తిరిగి పోదాం.

కోతులు ఈ హితవు మాటలు విని నవ్వాయి. అవి తమ నాయకుడితో ఇలా అన్నాయి:

"నీకు ముసలితనం వచ్చి, బుద్ధి పెడతల పట్టింది. అందుకనే ఏవేవో ఆపదలు ఊహించుకుని, అర్థంలేని సలహా ఇస్తున్నావు. స్వర్గంలాటి ఈ ప్రదేశాన్ని ఎన్నటికీ వదిలిపెట్టం. రాజకుమారులు పెట్టే కమ్మని తినుబండారాలు వదులుకుని, అడవులు పట్టిపోయి, అక్కడ పుల్లగా, ఉప్పగా, చేదుగా, వగరుగా ఉండే కాయలు తినం."

ఈ మాటలు వినేసరికి ముసలి కోతికి కళ్ళ వెంట నీరు కారింది. అది ఇలా అన్నది:

"మూఢులారా! ఈ సుఖాలు నిలవవని గ్రహించలేకుండా ఉన్నారు. ఈ కమ్మని తినుబండారాలే మీ ప్రాణాలకు కటిక విషమవుతాయి. నా కళ్ళ ఎదట మీరు నాశనం కావటం చూడలేను. నేను ఇప్పుడే అడవికి పోతాను. స్నేహితుడి



దైన్యమూ, తమ ఇళ్ళలో శత్రువులు ప్రవేశించటమూ, తమ దేశాన్ని పరాయి వాళ్ళు కొల్లగొట్టటమూ, తమ కుటుంబాలు నాశనం కావటమూ కళ్ళచూడని వాడు ధన్యుడంటారు!"

ఇలా అని ముసలి కోతి ఒంటరిగా అడవులకు వెళ్ళిపోయింది.

అది వెళ్ళిపోయిన కొద్ది రోజులకు పొట్టేలు దాని అలవాటు ప్రకారం వంట ఇంట ప్రవేశించి, రాజుగారి కోసం ప్రత్యేకంగా తయారుచేసిన వంటకాలు తినసాగింది. ఇంకా వంట పూర్తికాను కూడా లేదు. పొయ్యిల మీద ఇంకా పాత్రలలో పదార్థాలు ఉడుకుతున్నాయి.

వంటవాళ్ళకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. వాళ్ళ చేతికి ఏమీ అందక పోయేసరికి, మండుతున్న కట్టె తీసి పొటేలును నాలుగు చరుపులు చరిచారు. దాని వీపు మీది బొచ్చు అంటుకున్నది. అది బాధతో అరుస్తూ వెళ్లి, గుర్రపుసాల లోని ఎండుగడ్డి మీద పడి దొర్లి, బాధ నివారణ చేసుకోజూసింది. గడ్డి అంటుకుని, గుర్రపుసాల యావత్తూ తగలబడింది. కొన్ని గుర్రాలు చచ్చిపోయాయి. కొన్నిటికి కళ్ళుపోయాయి. నౌకర్లు కొన్ని గుర్రాలను అతి కష్టం మీద కాపాడగలిగారు. అయితే అవి కూడా ఒళ్ళంతా కాలి, బాధతో సకిలిస్తూ ఆవరణ అంతా పరిగెత్తసాగాయి.

గుర్రాలంటే ఎంతో ప్రేమగల రాజు వచ్చి, వాటి దీనస్థితి చూసి ఎంతగానో బాధ పడ్డాడు. ఆయన ఆస్థాన పశువైద్యుణ్ణి పిలిపించి, ''ఈ గుర్రాల బాధ నివారణకు మంచి చికిత్స ఏమిటి?'' అని అడిగాడు.

వైద్యుడు గ్రంథాలు తిరగవేసి, ''మహారాజా, పశువైద్యానికి పితామహుడైన శాలిహోత్రుడు ఇలా చెబుతున్నాడు. అప్పుడు చంపిన కోతుల కొవ్వు గుర్రాల బొబ్బలకు పట్టించినట్టయితే, సూర్యోదయం కాగానే చీకటి విచ్చిపోయినట్టు బాధ తొలగి పోతుందట. అందుచేత వెంటనే ఆ చికిత్స చేస్తాం.'' అన్నాడు.

ఆవరణలో ఉన్న కోతులన్నిటినీ వెంటనే చంపమని రాజు ఉత్తరువిచ్చాడు.

నౌకర్లు తినుబండారాలిచ్చే మిషమీద కోతులన్నిటినీ చేర్చి, వాటిని పట్టుకుని చంపేసి, వాటి కొవ్వు తీసి, గుర్రాల గాయాలకు పట్టించారు.

తన వారంతా చచ్చిన సంగతి ముసలి కోతి ఒక కాకి కబురు చెప్పగా విని, దుఃఖంతో కుప్పకూలి పోయింది. చచ్చిన కోతులలో ఆ ముసలికోతి సంతానమూ, వాటి సంతానమూ, దాయాదులూ ఇతర బంధువులూ ఉన్నాయి.





# భల్లూకమాంత్రికుడు

## 17

[ మాయామర్కటుడు మంత్రదండంతో కాళీవర్మ, భల్లూకమాంత్రికుల నుంచి తప్పించుకుని, నగరం చేరాడు. అక్కడ రాజభవనం ముందు అటవికుడి ఎలుగుబంటు, మర్కటుడి మీదికి దూకింది. ఆ సమయంలో అక్కడికి వచ్చిన కాపలావాళ్ళ నాయకుడు మాయామర్కటుణ్ణి, ఎలుగుబంటితో పట్టించి, రాజుగారి దగ్గిరకు బయలుదేరాడు. తరవాత—]

రాజభవనం మెట్ల దగ్గిర కాపలావాళ్ళ నాయకుడు కత్తి పైకెత్తి, వెనక వస్తున్న వాళ్ళందర్నీ ఆగమని హెచ్చరించి, జంతువులను ఆడించేవాడితో, "ఒరే, మహారాజుగారిప్పుడు సభాభవనంలో వున్నట్టున్నది. అక్కడికి నీ దిక్కుమాలిన పెంపుడు ఎలుగుబంటును తీసుకుపోవటం మర్యాద కాదు. దాని భుజాన వున్న కోతివెధవను, నీ భుజం మీదికి మార్చుకుని, నా వెంట రాజుగారి దగ్గిరకు రాగలవా ?" అని అడిగాడు.

జంతువులను ఆడించేవాడు ఆ మాటలకు కోపగించుకుంటున్నవాడిలా ముఖం పెట్టి, "నన్నేమైనా అనండిగాని, నా పెంపుడు ఎలుగుబంటును మాత్రం దిక్కుమాలిన ఎలుగుబంటంటూ కించపరచకండి. దాని తెలివితేటలకు ఎందరెందరో రాజులూ, సామంతులూ, పండి



తులూ అచ్చెరువు చెందారంటే నమ్మండి. సేతువు కట్టిన వాళ్ళలో దాని పూర్వుడొక డున్నాడన్నదానికి రుజువు, యీ తాళ పత్రాలే!'' అంటూ దుస్తుల్లో నుంచి ఒక తాళపత్రగ్రంధం బయటికి తీశాడు.

కాపలావాళ్ళ నాయకుడు పెద్దగా నవ్వి, ''ఆ వంశవృక్షం రాజుగారి ఆస్థాన పురోహితుడికి తరవాతచూపి, రాజుగారి నుంచి ఏదైనా బహుమతి సంపాదింతువు గాని, ముందు ఆ కోతి వేషపు శత్రు గూఢచారిని ఎలుగుబంటి భుజాల మీది నుంచి కిందికి దించు,'' అన్నాడు.

జంతువులను ఆడించేవాడు అయిష్టంగా ముఖంపెట్టి, ఎలుగుబంటు దగ్గిరకు పోయి, దాని వీపు తడుతూ, ''వీర బంటూ! భుజాల మీది కోతిగాణ్ణి కింద పడెయ్యి,'' అంటూ మాయామర్కటుడి నడుముకు బిగిసివున్న తాడును గట్టిగా లాగి పట్టుకున్నాడు.

ఎలుగుబంటు కోరలుచాచి పెద్దగా అరిచి, మాయామర్కటుడి నడుం పట్టుకుని కిందికి దించబోయేంతలో, మర్కటుడు కీచుమంటూ కిందికి దూకి, ''ఒరే, భల్లూకమాంత్రికుణ్ణించి ప్రమాదం కలగబోతున్నది. మీ రాజెక్కడ? నా మంత్ర దండం ఎక్కడ?'' అన్నాడు.

ఆ మాటలకు అక్కడ చేరిన జనం గట్టిగా చప్పట్లు చరిచారు. వాళ్ళల్లో ఒకడు పొడవాటి చేతికర్ర నొకదాన్ని మర్కటుడి కేసి చాస్తూ, ''ఇదుగో, నీ మంత్రదండం! ఏవైనా అద్భుతాల చేసి చూపించు,'' అన్నాడు.

మాయామర్కటుడు చప్పున కర్ర లాక్కుని, దాన్ని నిలువుగా నేల మీద ఆనించి, ఒక్క ఎగురున పోయి దాని చివర ఒంటికాలి మీద నిలబడి, ''ఒరే, మూర్ఖుల్లారా, ఇలాంటి అద్భుతం ఎవరైనా చేసి చూపగలరా? మీ రాజుకూ, రాజ్యానికూ్కడా ఆపద రానున్న యీ తరుణంలో గారడీవిద్యలతో ఆనందించేవాళ్ళను ఏమనాలి?'' అన్నాడు.

కాపలానాయకుడు మాయామర్కటుణ్ణి సమీపించి, వాడెక్కి ఒంటికాలి మీద నిలబడి వున్న కర్రను నరకబోతున్న వాడిలా కత్తి చాచి, "ఒరే, నిజంగా నువ్వు శత్రుగూఢచారివి కాదా? నువ్వనే భల్లూక మాంత్రికుడి మాట నిజమేనా?" అని అడిగాడు.

మాయామర్కటుడు మెరుపు వేగంతో కర్ర కొస నుంచి ఎగిరి కిందికి దూకుతూనే కాపలావాళ్ళ నాయకుడి చేతి నుంచి కత్తి లాక్కుని, దానితో తన నడుముకు బిగించి వున్న తాడును ఒక్క వేటుతో నరికి, "మూర్ఖులారా, నా శక్తిసామర్థ్యాలెలాంటివో తెలుసుకున్నారా? మీ రాజును వెంటనే యిక్కడికి పిలుచుకు రండి," అంటూ పళ్ళు కొరికాడు.

కాపలావాళ్ళ నాయకుడితో పాటు అక్కడ చేరిన వాళ్ళందరూ భయకంపితులైపోయారు. మాయామర్కటుడు యీసారి కత్తి ఝుళిపిస్తూ కాపలావాణ్ణి సమీపించి, "ఒరే, మందమతీ! నా ఆజ్ఞ ఏమిటో వినబడలేదా?" అన్నాడు.

కాపలానాయకుడు ప్రాణభయంతో వణికిపోతూ, "మహారాజుగారు నిండు సభలో వుండగా, వారిని యిక్కడికి రమ్మని కోరటమా? నా తల ఎగిరిపోతుంది," అన్నాడు.



"అలా అయితే, నేనే ఆయన దగ్గిరకు వెళతాను. ముందుండి దారితియ్యి," అన్నాడు మాయామర్కటుడు.

కాపలావాళ్ళ నాయకుడు కిక్కురు మనకుండా మెట్లెక్కి, భవనంలోకి దారి తీశాడు. జనం వాళ్ళను అనుసరించి పోవటానికి ధైర్యం చాలక వున్నచోటనే నిలబడిపోయారు.

రాజు జితకేతుడు సింహాసనంలో కూర్చుని, సభతీరివున్న పురప్రముఖులతో మాట్లాడుతున్నాడు. ఆ సమయంలో హఠాత్తుగా కాపలావాళ్ళ నాయకుడు సభ ముందుకు వస్తూనే, "మహారాజా, మన్నించాలి. నా వెనక మర్కటరూపంలో



కత్తి పట్టి వస్తున్నవాడు, మహా శక్తిమంతుడు. మన రాజ్యానికి రానున్న గొప్ప ప్రమాదం గురించి తమను హెచ్చరించేందుకు వస్తున్నాడు,'' అంటూ పక్కకు తప్పుకున్నాడు.

రాజు జితకేతుడితో పాటు, సభలో వున్నవాళ్ళందరూ మాయామర్కటుణ్ణి చూసి ముందు ఆశ్చర్యపోయి, అంతలోనే వాడి వింతరూపం కేసి పరీక్షగా చూసి పెద్దగా నవ్వారు.

రాజు జితకేతుడు సింహాసనం పక్కన నిలబడివున్న ఇద్దరు మంత్రుల కేసి తల తిప్పి, ''మన ప్రధానమంత్రి జీవగుప్తుడు సమయానికిక్కడలేడుగాని, వున్నట్టయితే చాలా ఆనందించెవాడు,'' అని అంతలోనే ఏదో ఆలోచనవచ్చినవాడిలా ముఖం గంభీరంగా పెట్టి, కాపలావాళ్ళ నాయకుడి కేసి చూస్తూ, ''పిరికివెధవా! ఒక్క బడుగు కోతికి నగరద్వారాలు తెరవటమే గాక, దాన్ని స్వయంగా సభామందిరానికి తెచ్చిన నీవు, నిజంగానే శత్రుసైనికులు ద్వారం దగ్గిరకు వస్తే, ఏమి చేసి వుండేవాడివి? నీ కిదే శిరశ్ఛేద శిక్ష విధిస్తున్నాను. నగర ప్రధాన తలారి రాగానే, నీకా శిక్ష దిరిసెనవనంలో అమలుజరుగుతుంది.'' అన్నాడు.

ఈ శిక్ష మాట వింటూనే సభలో వున్న వాళ్ళందరూ ఆనందోత్సాహంతో చప్పట్లు చరిచారు. అప్పటివరకూ రాజు కేసీ, సభాసదుల కేసీ కన్నార్పకుండా చూస్తున్న మాయామర్కటుడు చప్పున పెద్దగా గొంతెత్తి, ''జై, తాంత్రిక గురో!'' అంటూ కేక పెట్టి, ''జితకేతు రాజా, నగర ముఖ్యులారా! కొంచెం ఒళ్ళూ, మనసూ స్వాధీనంలో వుంచుకుని, నే చెప్పేది వినండి. నేను మామూలు కోతిని కాదు, ఒక మహా తాంత్రికవేత్త ప్రధాన శిష్యుణ్ణి. నా పేరు భ్రాంతిమతి! ఇప్పుడు మీ నగరం మీదికి కాళీవర్మ అనే మహా శూరుడూ, భల్లూక మాంత్రికుడనే మాంత్రికుడూ దాడి వస్తున్నారు. మిమ్మల్ని ఆ విషయమై



ముందుగా హెచ్చరించేందుకు యిక్కడికి వచ్చాను.'' అన్నాడు.

మాయామర్కటుడు యిలా అనగానే సభలో కలకలం బయలుదేరింది. రాజు జితకేతుడు ఒక్కక్షణకాలం నివ్వెరపోయి, సింహాసనంలోనుంచి లేచి నిలబడి, మాయామర్కటుడితో, ''నీ మాట తీరును బట్టి, నువ్వు మామూలు కోతివి కాదని అర్థమవుతున్నది. ఇక నువు చేసిన హెచ్చరిక సంగతి. ఆ దోషి కాళీవర్మతో పాటు వాడి మిత్రుల నందరినీ పట్టి బంధించి తీసుకురమ్మని, నా ప్రధానమంత్రి జీవగుప్తుడికి, కొంతమంది సైనికులను యిచ్చి పంపాను. వాళ్ళందరూ ఏమైపోయినట్టు!'' అన్నాడు.

ఆ ప్రశ్నకు మాయామర్కటుడు కీచు కీచు మంటూ నవ్వి, ''ఆ గుంపునంతా కాళీవర్మ అనేవాడు కత్తితో, మాంత్రికుడు భల్లూకుడు తన మంత్రదండంతో....'' అంటూ ఆగిపోయి, భీతిగొన్నవాడిలా చుట్టూ కలయ చూస్తూ, ''జై, తాంత్రిక గురో! నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ ఎగిరి కొంచెం దూరంలో నిలబడి వున్న కాపలావాళ్ళ నాయకుడి గొంతు పట్టుకున్నాడు.

కాపలావాళ్ళ నాయకుడు, మర్కటుడి పట్టు విడిపించుకునేందుకు నానా హైరానా పడిపోతూ. ''మర్కటప్రభో! మంత్రదండాల సంగతి నాకేం ఎరుక? మహారాజా, నా ప్రాణాలు కాపాడండి!'' అంటూ అరవసాగాడు.

సభలోవున్న వాళ్ళలో యిద్దరు ధైర్యవంతులూ, బలశాలులూ అయిన వాళ్ళు చప్పునపోయి మాయామర్కటుణ్ణి నడుం, చేతులూ పట్టుకుని యివతలికి లాగి, ''రాజ్యంలో మనుషుల ప్రాణాలు తీసే హక్కు మా మహారాజుగారొక్కరికి మాత్రమే వున్నది; నువ్విలా తొందరపడటం చట్టసమ్మతంకాదు.'' అన్నారు.

మాయామర్కటుడు కోపంతో పళ్లు పటపటా కొరికి, ''జితకేతురాజా! సంగతి



రెండు ముక్కల్లో చెపుతా, విను! నువ్విక్కడ నగరద్వారాల తలుపులు బిడాయించుకుని, సభ తీరి, కాలక్షేపం కబుర్లతో వినోదిస్తున్నావు. ఆ కారణంగా నగరం వెలపల ఏం జరుగుతున్నదీ నీకు తెలిసినట్టు లేదు. నీ ప్రధాన తలారి యిప్పుడు ఎలుగుబంటి రూపంలో వుండటమే గాక, కాళీవర్మ, భల్లూక మాంత్రికులతో కలిసి, మరొక రాక్షసుడు వెంటరాగా, నగరం మీదికి దాడివస్తున్నాడు,'' అన్నాడు.

రాక్షసుడి పేరు వింటూనే రాజు జితకేతుడు అదిరి పడి, ''రాక్షసుడా? అలాంటి వాళ్ళు వుండేవారని వినటమే గాని, యీక్షణంవరకూ చూసింది లేదు," అన్నాడు.

ఆ మాటలకు మాయామర్కటుడు వికటంగా నవ్వి, ''అయితే, త్వరలోనే నీకా కోర్కె తీరబోతున్నది! కాని, ఆ భయంకర రాక్షసుణ్ణి చూసింతరవాత—మరెన్నో క్షణాలకాలం మాత్రం నీవు జీవించివుండవు,'' అన్నాడు.

రాజు జితకేతుడి మంత్రులిద్దరూ ప్రాణభయంతో వడవడ వణికిపోతూ ముఖముఖాలు చూసుకుని, రాజుతో, ''మహారాజా, మనం యీ ప్రమాదంనుంచి బయటపడటం ఎలా?'' అన్నారు.

''ఇది రాజునైన నేను, మంత్రులైన మిమ్మల్ని అడగవలసిన ప్రశ్న. మిమ్మల్ని యిదే ఉద్యోగాల్లోంచి తొలగిస్తున్నాను. ఆ ప్రధాన మంత్రి జీవగుప్తుడే గనక, సమయానికక్కడ వున్నట్టయితే, తగిన మంత్రాలోచన చేసి, రానున్న ముప్పు నుంచి అందర్నీ కాపాడేవాడు,'' అని జితకేతరాజు, సింహాసనం దగ్గిర నుంచి కదిలి, మాయామర్కటుడి దగ్గిరకు వస్తూ, సభలోవున్న వాళ్ళతో, ''మన నగరం మీదికి మాంత్రికులతోపాటు రాక్షసులు కూడా కలిసి దాడివస్తున్నారు, మనం ఏం చేస్తే బావుంటుందంటారు?'' అని అడిగాడు.

సభలో ఎవరూ జవాబివ్వలేదు. వాళ్లు, రాక్షసుడు నగర ప్రవేశం చేయకమునుపే, ఇంటగల ధనం, యితర విలువైన వస్తువులూ తీసుకుని నగరం వదిలి పారిపోవటం ఎలా అన్న ఆలోచనలో వున్నారు.

రాజు జితకేతుడు సభికుల నుంచి ఎలాంటి జవాబూ రాకపోవటంతో, వాళ్ళు భయకంపితులై ఏమీ చెప్పలేని స్థితిలో వున్నారని గ్రహించి, మాయామర్కటుణ్ణి సమీపించి, "రూపంలో నువ్వు మర్కటాన్ని పోలివున్నా, మంత్రాలోచనలో నా ప్రధానమంత్రి జీవగుప్తుడికి సాటి వచ్చేలావున్నావు. ఆ మంత్రిని యీసరికే రాక్షసుడు తన పొట్ట పెట్టుకుని వుంటాడు. నిన్ను ప్రధాన మంత్రిగా నియమిస్తున్నాను. శత్రు సంహారానికీ, రాజ్య రక్షణకూ తగిన పథకం తక్షణం ఆలోచించి, అమలు చెయ్యి." అంటూ మర్కటుడి చేయి పట్టుకుని, సింహాసనం దగ్గిరకు నడిపించుకు వచ్చాడు.

సభలో కరతాళ ధ్వనులు మిన్ను ముట్టినై. మాయామర్కటుడు అభయం యిస్తున్నవాడిలా కత్తిని నోటపట్టుకుని, రెండు చేతులూ పైకెత్తి, ఏదో చెప్పబోయేంతలో, నోటి నుంచి కత్తి జారి కిందపడి ఖంగుమంటూ పెద్ద ధ్వని అయింది. మాయామర్కటుడు తల



వంచకుండానే కత్తిని తోకతో మెలిపెట్టి, పైకెత్తి పట్టుకుని, ఏదో చెప్పబోయేంతలో సభాద్వారం దగ్గిర పెద్ద కలకలం బయలుదేరింది. రాజు జితకేడుడితో పాటు అందరూ తలలుతిప్పి, అటుకేసి చూశారు.

మంత్రి జీవగుప్తుడు చిరిగినదుస్తులతో, శిరస్త్రాణం లేకుండా సభలో ప్రవేశించాడు. అతడికి కొంచెం వెనకగా సామంతు సూర్యభూపతీ, యిద్దరు సైనికులూ కూడా సభలోకి వచ్చారు. జీవగుప్తుణ్ణి చూస్తూనే కొందరు సభికులు, "ప్రధాన మంత్రిగారు సజీవుడే; రాక్షసుడికి ఆహారం అయిపోలేదు," అంటూ ఉత్సాహంగా కేకలు పెట్టారు.

మాయామర్కటుడు కోపంగా కత్తి పైకెత్తి, "ఒరే, మూర్ఖ పట్టణ ప్రముఖులారా! ఇంతకు ముందే గదా, రాజు జితకేతు నన్ను ప్రధాన మంత్రిగా నియమించింది. ఆ మాట మరిచారా?" అని, రాజు జితకేతుడితో, "ఓయ్, రాజా! నువ్వనేదేమిటి? ఇక్కడ ప్రధానమంత్రిని నేనా లేక శత్రువులకు వెన్నిచ్చి పారిపోయి వచ్చిన యీ జీవగుప్తుడా?" అని అడిగాడు.

"మర్కటుడే మన రాజ్యానికి ప్రధాన మంత్రి! ఆ మాట మరొకసారి చెపుతున్నాను. జీవగుప్తుడు యీ క్షణం నుంచీ నగరంలోని అతి సామాన్య పౌరులలో ఒకడు." అన్నాడు రాజు జితకేతుడు.

మంత్రి జీవగుప్తుడు అన్నిటికీ తెగించిన వాడిలా చప్పున కత్తి దూసి, మాయామర్కటుడి కేసి గుడ్లురుముతూ, "ఈ చచ్చు కోతివెధవ, చంద్రశిలానగర ప్రధాన మంత్రా? వీణ్ణి ఒకసారి రాక్షసుడు ఉగ్రదండుడి రాతి గద దెబ్బ నుంచి కాపాడాను; ఇప్పుడు స్వయంగా నేనే వీడి తల నరకబోతున్నాను." అంటూ మర్కటుడి కేసి బయలుదేరాడు.

రాజు జితకేతుడు కోపంగా, "జీవగుప్తా, ఆగు! ఇది మామూలు మర్కటం కాదు; భ్రాంతిమతి అనే గొప్ప తాంత్రికుడు!" అన్నాడు.

"ఈ తాంత్రికుడు దొంగిలించిన భల్లూక మాంత్రికుడి మంత్రదండం ఎక్కడున్నది? అది లేకుండా వీడు మామూలు చెట్టుకోతి కన్న కూడా నిస్సహాయుడు, హీనుడు! ఇదే నా ఖడ్గంతో వీడి తలా, తోకా నరకబోతున్నాను," అంటూ జీవగుప్తుడు కత్తి చాచి మర్కటుడి మీదికి దూకబోయాడు.

మాయామర్కటుడు, "జై, తాంత్రిక గురో!" అంటూ పెద్దగా ఒక కేక పెట్టి, తోకను మెరుపు వేగంతో తిప్పి, జీవగుప్తుడి చేతిలోవున్న కత్తిని మెలివేసి చప్పున లాక్కుంటూనే, తన దగ్గిర వున్న కత్తిని పైకెత్తాడు. —(ఇంకా వుంది)





# అచ్చిరాని వర్తకం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కొందరికి కొన్ని పనులు అచ్చిరావు. నువు చేసే పని నీకు అచ్చిరాదని నా అనుమానం. ఒక పని తనకు అచ్చిరాదని తెలుసుకున్న తరవాత రంగయ్యశ్రేష్ఠి లాగా ఆ పని విడిచిపెట్టాలి. శ్రమ తెలియకుండా నీకు అతని కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం రత్నగిరిలో రంగయ్యశ్రేష్ఠి, గోవిందయ్యశ్రేష్ఠి అని ఇద్దరు స్నేహితులుండేవారు. రంగయ్య వైశ్యుడే అయినప్పటికీ, వర్తకం చెయ్యక వ్యవసాయం చేపట్టి సుఖంగా జీవిస్తున్నాడు.

## బేతాళ కథలు



గోవిందయ్య మాత్రం వర్తకంలో మంచి నేర్పు కలిగి, బాగా డబ్బు సంపాదించాడు.

"రంగయ్యా, వైశ్యవృత్తి అయిన వర్తకం చెయ్యక, వ్యవసాయం చేసుకుంటున్నా వేమిటి?" అని గోవిందయ్య ఒకసారి అడిగాడు.

"వర్తకం మా వంశానికి అచ్చిరాదులే!" అన్నాడు రంగయ్య.

అతని తాత ముత్తాతల కాలంలో రంగయ్య పూర్వీకులు సముద్రవర్తకం చేశారు. కాని రంగయ్య తాత తన ఓడతో సహా తాను కూడా సముద్రం పాలయాడు, సర్వనాశనం అయిపోయింది. తరవాత రంగయ్య తండ్రి భూదేవిని నమ్ముకుని, వ్యవసాయం ప్రారంభించి, బాగుపడ్డాడు. రంగయ్య హయాంలో వ్యవసాయం మరింత ఉచ్చదశకు వచ్చింది. రంగయ్య ఏలోటూ లేకుండా బ్రతుకుతున్నాడు.

ఇలా ఉండగా ఒకనాడు గోవిందయ్య రంగయ్యతో, తాను సముద్ర వర్తకంలో దిగి, సుగంధద్రవ్యాల వ్యాపారంతో అంతులేని లాభాలు సంపాదించ బోతున్నాననీ, రంగయ్య కూడా సగం వాటాకు వస్తే ఇద్దరూ లాభం పొందవచ్చుననీ, ఖర్చులు కలిసి వస్తాయనీ అన్నాడు.

మామూలు వర్తకమే అచ్చిరాదనుకున్న రంగయ్య ఏ బుద్ధిన ఉన్నాడో కాని, గోవిందయ్య చేసినంత పెట్టుబడి తాను కూడా చేసి, సముద్ర వర్తకంలో వాటా తీసుకోవటానికి ఒప్పుకున్నాడు. భార్య వద్దంటున్నా వినక, రంగయ్య తన భూములలో సగం అమ్మేసి, ఆ డబ్బుతో సుగంధద్రవ్యాలు కొని, తన నలుగురు కొడుకులనూ వెంట బెట్టుకుని, గోవిందయ్యతో బాటు ఓడలో బయలుదేరాడు.

దారిలో ఓడ తుఫానులలో చిక్కుకున్నది. వర్తకపు సరుకంతా తడిసి, చెడిపోయింది. ఓడ రేవుగాని రేవు చేరింది. తడిసిపోయిన సరుకును కారుచౌకగా నష్టానికి అమ్మేసి, మిత్రులిద్దరూ చావు

తప్పి కన్ను లొట్టపోయినట్టు అయి, ఇళ్లకు చేరుకున్నారు.

పాపిష్టి డబ్బు పోతే పోయింది! తన భర్తా, కొడుకులూ ప్రాణాలతో తిరిగి వచ్చారు, అంతే చాలుననుకుని, రంగయ్య భార్య తాను దేవుళ్లకు మొక్కుకున్న మొక్కులన్నీ చెల్లించింది.

అయితే ఆమె ప్రాణం కుదుట పడలేదు. రంగయ్య తన మిగిలిన పొలమంతా అమ్మేసి, మళ్లీ సుగంధ ద్రవ్యాలు కొని, సముద్ర వర్తకం మీద బయలుదేరబోతూ, "నువు కూడా వస్తున్నావా, గోవిందయ్యా?" అని అడిగాడు.



"మళ్లీనా!" అన్నాడు గోవిందయ్య, రంగయ్య తెగువకు నిర్ఘాంతపోతూ.

రంగయ్య తన కొడుకులను తన వెంట మళ్లీ రమ్మన్నాడు.

"బతికుంటే బలుసాకు తినవచ్చు! పొలమంతా అమ్మేశావుగద, ప్రాణాలుంటే వ్యవసాయ కూలీలు గానైనా బతుకుతాంగాని సముద్రంవాత పడం!" అన్నారు రంగయ్య కొడుకులు.

ఈసారి రంగయ్య వర్తకం చాలా విజయవంతంగా సాగింది. పెట్టుబడికి నాలుగింతలు లాభంవస్తే సముద్రవర్తకం గిట్టుబాటు అయినట్టే నంటారు. రంగయ్య పెట్టుబడికి పదింతలు లాభంతో తిరిగి వచ్చి, తాను అమ్మిన పొలానికి రెట్టింపు కొని, ఇతర ఆస్తులుకూడా సంపాదించాడు.

గోవిందయ్య తాను కూడా ఈసారి రంగయ్య వెంట సముద్రవర్తకం చెయ్యనందుకు పశ్చాత్తాపపడ్డాడో ఏమో, "నువు ఈ యేడు మళ్లీ సముద్రవర్తకం మీద పోతున్నావా, రంగయ్యా?" అని అడిగాడు.

"ఎందుకొచ్చినది, గోవిందయ్యా? నాకు వర్తకం అచ్చిరాదులే. చాతనయిన పని! వ్యవసాయం చేసుకుంటాను!" అన్నాడు రంగయ్య.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రంగయ్య మనస్తత్వం ఎలాటిది? అతను

నిజంగా వర్తకం తనకు అచ్చిరాదని అనుకున్నవాడైతే, గోవిందయ్య వెంట సముద్ర వర్తకానికి ఎందుకు బయలు దేరాడు? బయలుదేరిన వాడు నష్టపోయి, తనకు వర్తకం అచ్చిరాదని రుజువు అయినాక, మరోసారి ఎందుకు వర్తకానికి పూనుకుని, తనకున్న సమస్తమూ దాని కోసం వినియోగించాడు? అందులో అపారంగా లాభాలు సంపాదించిన మనిషి, ఆ వర్తకం మానేసి, అది తనకు అచ్చిరాదని ఎందుకన్నాడు? రంగయ్య వింతప్రవర్తనకు అర్థం ఏమిటో తెలిసి కూడా చెప్పకపోతే, నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''వ్యవసాయమూ, వర్తకమూ వేరు వేరు మనస్తత్వాలకు అనుకూలించేవి. ఆ సంగతి రంగయ్యకు బాగా తెలుసు. వర్తకం చేసేవాడికి జూదగాడికుండే తెగింపూ, సాహసమూ ఉండాలి. వ్యవసాయానికి ఓర్పూ, శ్రమశక్తీ కావాలి. తనకు వర్తకం అచ్చిరాదనటంలో రంగయ్య ఉద్దేశం తనలో జూదగాడి మనస్తత్వం లేదని! అంతేగాని, వర్తకం చేస్తే తనకు విధిగా నష్టం వస్తుందని అతని ఉద్దేశం కాదు. గోవిందయ్య సముద్ర వర్తకానికి పిలవగానే అతనిలో గుప్తంగా ఉండిన తాతముత్తాతల జూదరి మనస్తత్వం పైకి తన్నింది. సముద్ర వర్తకం చేసి దెబ్బతినటంతో జూదరి మనస్తత్వం అతనిలో మరింత ప్రకోపించింది. ఎంత దురదృష్టవంతుడు కూడా వరసగా రెండుసార్లు దెబ్బతినడు. అందుచేత, రంగయ్య తన కున్నదంతా పణంగా పెట్టి సముద్ర వ్యాపారంతో జూదం ఆడాడు, లాభం వచ్చింది. అంతటితో రంగయ్య మామూలు మనిషి అయాడు. అతని మనస్తత్వానికి జూదం గిట్టదు. అందుచేత తిరిగి వ్యవసాయంలో స్థిరపడ్డాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# వంటవాళ్ళు

పెద్దాపురం సంతలో భీమయ్యా, రాఘవయ్యా అనే ఇద్దరు బాల్యమిత్రులు చాలాకాలం తర్వాత కలుసుకున్నారు. పెళ్ళిళ్ళు అయి, సంసారాలు ప్రారంభించాక ఇద్దరూ చెరొక ఊళ్ళోనూ స్థిరపడిపోయారు. అనేక సంవత్సరాల అనంతరం కలుసుకున్న ఆ బాల్యమిత్రులు చాలాసేపు ఒకరి సంగతి ఒకరికి చెప్పుకున్నారు. భీమయ్య చిన్న ఎత్తు వర్తకం చేస్తున్నాడు. అతని భార్య శాంతమ్మ. వారికి పెళ్ళీడుకు వచ్చిన కొడుకు ఒకడు ఉన్నాడు.

రాఘవయ్య వ్యవసాయం పనులు చేసుకుంటూ పొట్ట పోసుకుంటున్నాడు. అతని భార్య పేరు కాంతమ్మ. వారికి కూడా పెళ్ళీడు వచ్చిన ఆడపిల్ల ఉన్నది.

ఈ విధంగా స్నేహితు లిద్దరూ వేరు వేరు జీవితాలు జీవిస్తున్నా, ఇద్దరికీ ఒక పోలిక ఉన్నది. ఇద్దరి భార్యలూ బద్ధకస్తురాళ్ళు, తమ భర్తలకూ, పిల్లలకూ వండి పెట్టలేరు. వాళ్ళకు వంటరాదని కాదు, వంటమీద శ్రద్ధలేదు. బలవంతాన వంట చేయిస్తే అది తినటానికి ఉండదు. ఇంట్లో వాళ్ళు పస్తులుండవలసిందే. అందుచేత స్నేహితు లిద్దరూ తమ ఇళ్ళలో తామే వంటచేస్తూంటారు.

ఇద్దరి తలలూ ఏకం చేసినాక, వాళ్లకు తమ భార్యల బద్ధకం వదలగొట్టి, వాళ్ళ చేత వంట చేయించటానికి ఒక మార్గం తట్టింది. ఇద్దరూ కలిసి ఒక పథకం వేశారు. ఆ పథకం ప్రకారం రాఘవయ్య ఇంటికి భీమయ్యా, భీమయ్య ఇంటికి రాఘవయ్యా వెళ్ళి, తమను తమ మిత్రుల భార్యలకు పరిచయం చేసుకున్నారు.

రాఘవయ్య శాంతమ్మతో, "అయితే, చెల్లెమ్మా, మా బావ భీమయ్య ఇంటో

ఎమ్. వి. వి. సత్యనారాయణ



లేడా? పెళ్లి విషయం మాట్లాడదామని పచ్చాను," అన్నాడు.

శాంతమ్మ చాలా సంతోషించింది. సంత నుంచి వచ్చిన రాఘవయ్య బస్తీకి తగిన బట్టలు వేసుకుని, బాగా కలిగిన వాడిలాగా కనిపించాడు. మంచి కట్నంతో తన కొడుక్కు పెళ్లి అవుతుందని ఆశపడి, శాంతమ్మ రాఘవయ్యతో, తన భర్త సంతకి వెళ్ళాడనీ, ఈ పాటికి వస్తూ ఉండాలనీ చెప్పి, ఆ పూట అతనికి మంచి విందు భోజనంలాటిది పెట్టింది. ఆ రోజు భీమయ్య రాలేదు, అయినా శాంతమ్మ, "రేపు తప్పకుండా వచ్చేస్తారు," అని రాఘవయ్యను ఉంచేసింది.

నాలుగు రోజులు గడిచినా భీమయ్య రాకపోయేసరికి, నాలుగు రోజులూ దివ్యంగా భోజనం చేసిన రాఘవయ్య, తనకు అవతల పనులు పాడవుతున్నాయని చెప్పి, బయలుదేరి వెళ్లిపోయాడు.

అతను వెళ్లిన మర్నాడు భీమయ్య ఇంటికి చేరాడు. అవతల రాఘవయ్య భార్యకూడా తన బద్ధకం అవతల పెట్టి, భీమయ్యకు నాలుగు రోజులపాటు దివ్యంగా వంటచేసి పెట్టింది. అతను కూడా రాఘవయ్య కోసం ఆత్రంగా ఎదురు చూసినట్టు నటించి, ఇంటి దగ్గిర తొందర పనులున్నాయని చెప్పి, బయలుదేరి వచ్చేశాడు.

ఇద్దరూ ఇళ్ళకు రాగానే, తమ మిత్రులు పెళ్లి విషయం మాట్లాడటానికి వచ్చి, నాలుగు రోజులుండి, నిరాశగా వెళ్లినట్టు తమ భార్యల నుంచి విన్నారు.

ఇద్దరినీ వారి భార్యలు తొందరపెట్టి, పెళ్లి విషయం తేల్చుకు రమ్మన్నారు. వాళ్ళు తిరిగి సంత రోజున కలుసుకుని, తమ పథకం ఎంత బాగా పారినదీ, తమ భార్యలు ఎంత ఉత్సాహంగా నాలుగు రోజులు పిండివంటలతో సహా వంటలు చేసినదీ తెలుసుకుని సంతోషించి, చెయ్యవలసిన పని గురించి చర్చించుకుని, తమ ఇళ్ళకు తిరిగి వచ్చారు.

తన భర్త ఇంటికి రాగానే శాంతమ్మ, "ఏమండీ, పెళ్లి విషయం ఏమన్నారు?" అని ఆత్రంగా అడిగింది.

భీమయ్య కోపం నటిస్తూ, "వాళ్ళు ఎంత కలిగిన వాళ్ళయినా అంత పొగరు కూడదు. ఈ సంబంధం కుదరదు," అన్నాడు.

"ఏం? ఏమయింది?" అన్నది శాంతమ్మ.

"ఏం కావాలి? వాళ్ళ పిల్ల వంట చెయ్యదుట! పెళ్లి అయాక మనవాడు ఆవిడకి వండి వార్చాలిట!" అన్నాడు భీమయ్య.

"మన అబ్బాయి వంట చెయ్యటం ఏమిటి?" అన్నదామె.

"మన కొంపలో నేనే వంట చేస్తానని ఆ రాఘవయ్యకు తెలిసిపోయినట్టుంది. వాళ్ళ ఇంట్లో కూడా ఆడవాళ్ళు వంట చేయరుట!" అన్నాడు భీమయ్య.

తన మూలంగా తన కొడుక్కు మంచి సంబంధం తప్పిపోతున్నందుకు శాంతమ్మ ఎంతో వేదనపడి, "ఎప్పుడో నాకు ఒంట్లో బాగుండనప్పుడు తప్ప నేనే వంట చేస్తున్నానని చెప్పి వాళ్ళను ఒప్పింతురూ!" అన్నది ప్రాధేయపడుతూ.

"ఏమిటా పిచ్చిమాట? నేనే వంట చేస్తున్నానని వాళ్ళు నాతో అన్నారా ఏమిటి? నన్ను పోయి, దొంగ అనిపించుకోకుండానే భుజాలు తడుముకోమంటావా ఏమిటి? మంచి సంబంధం పోయింది. చేతులు



కాలినాక ఆకులు పట్టుకుని లాభంలేదు,'' అని భీమయ్య తన భార్య పశ్చాత్తాపాన్ని మరింత పెంచాడు.

ఈ లోపల రాఘవయ్య కూడా బిక్క మొహం వేసుకుని ఇంటికి పోయి, ''లాభం లేదు. ఈ సంబంధం మనకు ప్రాప్తం లేదు!'' అన్నాడు.

''ఏం?'' అన్నది కాంతమ్మ.

''పెళ్ళి కాగానే వాళ్లు వంటవాళ్ళందరినీ మాన్పించి, మన అమ్మాయి చేత ఇంటిల్లిపాతికీ వంట చేయిస్తారుట! మన ఇంటో మగవాళ్ళే చేతులు కాల్చుకుంటారని వాళ్ళకు తెలిసిందిలాగుంది,'' అన్నాడు రాఘవయ్య.

''అదేంమాటండీ? మీరు ఇష్టపడి వంట చేస్తున్నారుగాని, నేను వంట చెయ్యనని వ్రతం పట్టానా ఏం? మీరింట లేనప్పుడు నేను పిండివంటలతో సహా చెయ్యలా? మీ స్నేహితుడు నా చేతి వంట నాలుగు రోజులపాటు తిన్నాడే!'' అన్నది కాంతమ్మ.

''అయితే ఇప్పుడేమంటావు?'' అని రాఘవయ్య అడిగాడు.

''పిల్ల వంట చేస్తుంది! అది వంట చెయ్యకుండా ఉండటం కోసం మంచి సంబంధం వదులుకుంటామా? వెళ్ళండి, ముహూర్తం పెట్టుకురండి,'' అన్నది కాంతమ్మ రాఘవయ్యతో.

రాఘవయ్య భీమయ్య ఇంటికి వచ్చి, ''బావా, చెల్లెమ్మా! మా పిల్ల వంట చేస్తుందిట! ముహూర్తం పెట్టుకుందామా?'' అనేసరికి కాంతమ్మ ప్రాణం లేచి వచ్చింది. రాఘవయ్య నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుని, ముహూర్తం పెట్టుకుని మరీ వచ్చాడని తెలియగానే కాంతమ్మ, ''బతుకు జీవుడా! ఇక ఎన్నడూ మగవాళ్ళ చేత వంట చేయించను!'' అని ఒట్టు పెట్టుకున్నది.

తీరా పెళ్ళి అయాక తెలిసింది, రెండు కుటుంబాలూ ఏమంత కలిగిన కుటుంబాలు కావని. ఏమైతేనేం? భీమయ్యా, రాఘవయ్యలు మళ్ళీ గరిట పట్టలేదు.



# దుష్టభావాలూ, దుష్ఫలితాలూ

కరటకశాస్త్రి పాముమంత్రం వెయ్యటంలో అఖండుడు. దమనకశాస్త్రి పక్షవాతం నయం చెయ్యటంలో అద్భుత ప్రజ్ఞగలవాడు. కాని ఇద్దరూ సంకుచిత స్వభావులు. ఈ ప్రత్యేకతలతో ఇద్దరూ అంతులేని డబ్బు సంపాదించి, ఎక్కడో రహస్యంగా దాచారు. వాళ్ళు తమ జ్ఞానాన్ని అంతకన్న రహస్యంగా దాచి, వార్ధక్యం మీదపడినా దాన్ని ఎవరికీ చెప్పలేదు. వాళ్ళవద్ద శిష్యత్వం చేస్తామని ఎందరో వచ్చారు. కాని వాళ్లు తమ విద్యలను ఎవరికీ చెప్పక, చచ్చేలోపల తమ పిల్లలకే చెప్పిపోతాం లెమ్మని అందరితోనూ అనేవారు.

ఒకనాటి తెల్లవారుఝామున దమనకశాస్త్రిని పాము కరిచింది. ఆయన ఇంటికి తిరిగి వచ్చి, తాచుపాము కరిచిందని కొడుక్కు చెప్పి, ఇంకేమీ చెప్పకుండానే స్పృహతప్పిపోయి నురుగులు కక్కాడు.

అతని కొడుకు కరటకశాస్త్రి వద్దకు వెళ్ళి, పాముమంత్రం వేసి తన తండ్రిని బతికించమని అడగబోయాడు. కాని అదే సమయంలో కరటకశాస్త్రికి పక్షవాతం వచ్చి, కాళ్లూ, చేతులూ, నోరూ కూడా పడిపోయాయి.

—గుంటక సాంబిరెడ్డి





# స్నేహం విలువ

మగధ సింహాసనాన్ని చంద్రసేనుడు ఎక్కగానే, గురుకులంలో అతని సహాధ్యాయులుగా ఉండిన నలుగురు మిత్రులు అతన్ని చూడవచ్చి అతని సహాయం కోరారు. వారు నలుగురూ పేదవారే.

చంద్రసేనుడు వారిని, "మీకు ఉద్యోగాలు కావాలా? లేక ధనసహాయం కావాలా?" అని అడిగాడు.

"నాకు ధనం ఇస్తే, నాతో బాటు మరి నలుగురికి ఉపాధి కల్పించగలను." అన్నాడు ఒకడు.

చంద్రసేనుడు అతనికి కోరినంత డబ్బు ఇచ్చి పంపేశాడు.

రెండోవాడు, "డబ్బుతో జీవనోపాధి కలిగించుకునే ప్రజ్ఞ నాకు లేదు. ఏదైనా ఉద్యోగం ఇప్పిస్తే చాలు." అన్నాడు.

చంద్రసేనుడు అతనికి ఒక ఉద్యోగం ఇప్పించాడు.

"నాకు చేతనైనది వ్యవసాయం. నేను డబ్బుగాని, ఉద్యోగంగాని కోరను. ఇంత భూమి ఇప్పిస్తే, సుఖంగా వ్యవసాయం చేసుకుంటాను." అన్నాడు మూడోవాడు.

చంద్రసేనుడు అతనికి భూమి ఇప్పించాడు.

నాలుగోవాడు, "నాకు మీ స్నేహం తప్ప ఇంకేమీ అవసరంలేదు. అదే నాకు అష్టఐశ్వర్యాలు. అదీకాక రాజుకు మంచి స్నేహితులవల్ల లాభం ఉండవచ్చు." అన్నాడు. అతని పేరు వీరదాసు.

తన స్నేహం అతనికి ఎలా ఐశ్వర్యం తెచ్చేదీ చూడాలనిపించి, చంద్రసేనుడు అతని కోరికకు సమ్మతించాడు.

చంద్రసేనుడు రోజూ సాయంకాలం రాజవీధి వెంట ఉద్యానవనానికి వెళ్ళేటప్పుడు, వీరదాసును రథంలో తనతో బాటు తీసుకుపోయేవాడు. వీరదాసు

వేమూరు వెంకయ్య

రాజుకు సన్నిహితుడన్న సంగతి పుర ప్రముఖులకూ, వర్తకులకూ తెలిసిపోయింది.

నెల రోజులు గడిచాయి. ఒకనాడు రాజు వెంట వెళుతున్న వీరదాసు వర్తకుల కూడలిలో రథం ఆపించి, తనకు అక్కడ పని ఉన్నదని, దిగిపోయాడు.

వెంటనే గొప్ప వర్తకులందరూ వీరదాసు చుట్టూ మూగి, అమితంగా మర్యాదలు చేసి, దివాణం వ్యవహారాలు మాట్లాడారు. వీరదాసు సూచన ప్రాయంగా, రాజుగారు మరింత హెచ్చు రాబడి గురించి ఆలోచిస్తున్నాడనీ, బహుశా వ్యాపారస్థుల మీద పన్నులు పెరగవచ్చుననీ అన్నాడు.

వెంటనే వర్తకులు తమ తమ తాహతును బట్టి వీరదాసుకు కానుకలు ఇచ్చుకుంటామనీ, తమ మీద పన్నుల భారం హెచ్చకుండా చూడమనీ ప్రాధేయపడ్డారు.

వీరదాసు అభ్యంతరం చెప్పలేదు. వారానికొకసారి వ్యాపారంలో తమకు వస్తున్న లాభాలలో కొంత భాగం అతనికి చెల్లిస్తూ వచ్చారు. త్వరలోనే వీరదాసు అపార ధనవంతుడయి కూర్చున్నాడు. అయితే ఇది పరమరహస్యంగా జరిగిన ఏర్పాటు కాదు. వర్తకుల లెక్కలు తణిఖీ చేసే అధికారీ, న్యాయాధికారీ ఈ గూడుపుఠాణీలో చేరినవాళ్ళే. వాళ్ళు



వీరదాసు వద్ద ఎప్పటికప్పుడు తమ వాటా తీసుకుపోతూ వచ్చారు.

కొంత కాలానికి వీరదాసు రాజధానిలోనే అద్భుతమైన భవనం నిర్మించి, గృహప్రవేశానికి రాజునూ, మంత్రినీ, రాజోద్యోగులనూ, వర్తక ప్రముఖులనూ ఆహ్వానించాడు.

రాజు వీరదాసుతో, "ఇంత కొద్ది కాలంలో ఇంత సంపన్నుడివి ఎలా కాగలిగావు?" అని ఆశ్చర్యంగా అన్నాడు.

"మహారాజా, మీ స్నేహంతో రాజ్యాలే సంపాదించగలను," అన్నాడు వీరదాసు.

"ఎలా సంపాదించావో తెలుసుకోవాలని ఉన్నది," అన్నాడు చంద్రసేనుడు.

"రేపు రాత్రికి నా గదిలో రహస్యంగా దాగి ఉండి, జరిగేదంతా చూడండి. మన స్నేహంవల్ల నేను పొందిన లాభం చూశారు. మీరు పొందగల లాభం చూపిస్తాను," అన్నాడు వీరదాసు.

మర్నాడు అతను తణిఖీదారుకూ, న్యాయాధికారికీ ఒక గాలి కబురు అందేలాగా ఏర్పాటు చేశాడు. ఆ రాత్రి రాజు వీరదాసు ఇంటికి వచ్చి, అతని కచేరీ సావడి సరసన ఉన్న చిన్న గదిలో దాక్కున్నాడు. కొంతసేపటికి తణిఖీదారు వచ్చి, "ఈసారికి నా వాటా మీరే ఉంచేసుకుని నాకొక సహాయం చెయ్యాలి," అని వీరదాసును వేడుకున్నాడు.

"ఏమిటా సహాయం?" అని వీరదాసు తణిఖీదారును అడిగాడు.

"నేను శ్రద్ధగా పనిచెయ్యటం లేదని రాజుగారు నన్ను ఉద్యోగం నుంచి తొలగించి, మరొకరిని నియమించనున్నట్టు తెలిసింది. నిక్షేపంలాటి రాబడి పోతుంది. నేను నా పని సమర్థతతో చేస్తున్నట్టు రాజుగారికి చెప్పి, నా ఉద్యోగం నిలబెట్టాలి," అన్నాడు తణిఖీదారు.

"అలాగే చూస్తాను," అన్నాడు వీరదాసు.

తణిఖీదారు వెళ్ళిన కొంతసేపటికి న్యాయాధికారి వచ్చి, "ఈసారి నా వాటా మీరే ఉంచేసుకుని, నన్ను రాజుగారు బదిలీ చెయ్యకుండా చూడాలి. వర్తకులు లేనిచోట, కర్షకుల మధ్య నేను ఏం సంపాదించుకోగలను?" అన్నాడు.

"అలాగే, చూస్తాను," అని వీరదాసు న్యాయాధికారిని పంపేసి, రాజు వద్దకు వెళ్ళి, "చూశారు గదా, మహారాజా! మీ స్నేహం మూలంగా నేను లంచగొండులందరినీ అయస్కాంతం లాగా ఆకర్షించాను. మీ పరిపాలనలో లంచగొండులకు స్థానం లేకుండా చెయ్యటానికి నా స్నేహం ఉపయోగపడింది కదా?" అన్నాడు.

ఇంద్రసేన మహారాజు ఏదో వంకపెట్టి తణిఖీదారునూ, న్యాయాధిపతినీ పదవులలో నుంచి తొలగించాడు.





# భృగుడు

"భృగు'' అంటే ''ప్రకాశించు'' అని అర్థం. ''భృగు'' అనే మాట అగ్నికి గల పేర్లలో ఒకటి అని కొందరు పండితులు ఊహిస్తున్నారు. భృగువంశం వేదకాలం నాటికే అతి ప్రాచీనమైనది. ఋగ్వేదంలో అగ్నికి సంబంధించిన సూక్తాలలో భృగుల ప్రశంస, లేక ప్రస్తావన 21 సార్లు వస్తుందట. భృగులు మానవులకు అగ్నిని అందజేశారనీ, వారు దానిని కర్రలో దాగి ఉన్నట్టు కనిపెట్టి, కర్రలను మథించి అగ్నిని వెలికితెచ్చి, మానవులకు మిత్రుడుగానూ, హితకారిగానూ ఉండేటట్టు చేశారనీ ఋక్కులు చెబుతున్నాయి.

వేదకాలంలో భృగులకు అగ్నితో సన్నిహిత సంబంధం ఉంటే, పురాణ కాలంలో భృగుమహామునికి రాక్షసులతో సన్నిహిత సంపర్కం ఉన్నట్టు కనబడుతుంది. బ్రహ్మహృదయం నుంచి పుట్టినట్టు చెప్పబడే ఈ ముని ప్రాచీనుడని తెలుస్తున్నది గాని, ఇతని పెద్ద భార్య హిరణ్యకశిపుడి కూతురైన దితి. (కశ్యపుడి భార్యపేరు కూడా దితి అనే అంటారు ; కాని ఆమె రాక్షసులను కన్నదేగాని, రాక్షసుడికూతురు కాదు–దక్షుడికూతురు) భృగుడికీ, దితికీ పుట్టిన వాడు కవి అనేవాడు. ఈ కవి కొడుకే శుక్రుడు—దానవులకు గురువు!

రాక్షసులు భృగుడి ఇంటిని తమ రహస్యస్థావరంగా వాడుకుని, దేవతలతో గెరిల్లాయుద్ధాలు చేశారు. భృగుడి భార్య వారిని తన ఇంట దాస్తూ వచ్చింది. అది తెలిసి, విష్ణువు తన చక్రంతో ఆమెను చంపాడు. భృగుడు మండిపడి, భార్యావియోగంతో అలమటించమని శపించగా, రామావతారంలో విష్ణువు భార్యావియోగం అనుభవించాడట.

భృగుడు ఖ్యాతి అనే ఆమెను కూడా పెళ్ళాడాడు. ఈమె కర్దమ ప్రజాపతి కూతురు. ఈమె భృగుడికి ధాతా, విధాతా అనే కొడుకులను కన్నది.

భృగుడికి పులోమ అనే మరొక భార్య కూడా ఉండేది. ఒకసారి భృగుడు పులోమను అగ్నిగృహంలో అగ్నులను చూస్తూండమని చెప్పి, తాను బయటికి వెళ్ళాడు. అప్పుడు పులోము డనే రాక్షసుడు అగ్నిగృహానికి వచ్చి, పులోమను చూసి, "ఈమె ఎవరు?" అని అగ్నిని అడిగాడు.

"భృగుడి భార్య." అని అగ్ని చెప్పాడు.

పులోమ తనకు భార్యకావలసినదని చెప్పి, పులోముడు ఆమెను ఎత్తుకు పోయాడు. తరవాత ఆమె గర్భాన చ్యవనుడు పుట్టి, ఆ రాక్షసుణ్ణి భస్మంచేశాడు.

తన భార్యను రాక్షసుడు ఎత్తుకు పోవటానికి అగ్ని కారకుడని, భృగుడు అగ్నిని సర్వభక్షకుడవు కమ్మని శపించాడు.

"తెలిసిన విషయం చెప్పటంలో దోషమేమిటి?" అని అగ్ని ఆగ్రహించి, సమ్మె చేసి, హవ్యాలు దేవతలకు అందించక, ఎక్కడో వెళ్ళి దాక్కున్నాడు. దేవతలు అగ్నిని నిత్యశుచివి అని ఊరడించి మళ్ళీ పనిలోకి రప్పించారు

భృగుణ్ణి ఋషిశ్రేష్ఠుడంటారు. ఆయన నిగ్రహశక్తితోబాటు అనుగ్రహ శక్తి కూడా కలవాడు. వసిష్ఠుడు నిమిని చావమని శపించినప్పుడు, భృగుడు నిమిని "నిమేష" (కనురెప్పపాటు) రూపంలో సజీవుడుగా ఉంచాడట.

వత్సదేశపు రాజైన వీతహవ్యుడి కొడుకులు కాశీరాజకుటుంబాన్ని చంపి, దివోదాసును ఓడించారు. దివోదాసు కొడుకు ప్రతర్దముడు వీతహవ్యుడి కొడుకులను చంపి, వీతహవ్యుణ్ణి చంప వచ్చాడు. అతను వెళ్ళి భృగుడి ఆశ్రమంలో దాక్కున్నాడు. ప్రతర్దముడు వీతహవ్యుడి కోసం వస్తే భృగుడు తన ఆశ్రమంలో క్షత్రియుడెవడూ లేడన్నాడు!





# సరస్వతి పొంగింది

గౌతముడు అనే ఋషికి ఏకతుడూ, ద్వితుడూ, త్రితుడూ అని ముగ్గురు కొడుకులు. తండ్రి ముగ్గురిచేతా చక్కగా అధ్యయనం చేయించాడు.



ముగ్గురిలోకీ త్రితుడు శ్రేష్ఠుడు. అతని ప్రసంగాలు వినటానికి ఎక్కడెక్కడి వాళ్ళూ వచ్చేవారు.



ఒకసారి ముగ్గురు సోదరులూ యజ్ఞం చేయతలపెట్టి, తగిన ప్రదేశాన్ని వెతుక్కుంటూ బయలుదేరారు.



వారు నిర్జనప్రదేశంలో నడుస్తూండగా, ముందు నడుస్తున్న త్రితుడికి ఎట్టెదట ఒక పెద్దపులి ప్రత్యక్షమయింది. అతను దాన్ని దగ్గిరకు వచ్చిన దాకా చూడలేదు.

ఏకతుడూ, ద్వితుడూ మటుకు పులిని ముందుగా చూసి కూడా. త్రితుణ్ణి హెచ్చరించక, పారిపోయి చెట్టెక్కారు.





త్రితుడు కూడా పారిపోతూ ఒక పాడు బడిన బావిలో పడిపోయాడు. అతనికి పులి నుంచి అపాయం తప్పింది. త్వరలోనే అతనికి స్పృహ కూడా తెలిసింది.

అతని అన్నలు అతన్ని పులి చంపి ఉంటుందనుకుని చాలా సంతోషించారు; అతనికి యజ్ఞభాగం ఇచ్చే అవసరం తప్పింది గదా అనుకున్నారు.





అయితే భూతపిశాచాల ఉచ్చాటన మంత్రం త్రితుడికే తెలుసు, అతని అన్నలకు తెలీదు. వారి యజ్ఞభూమిని భూతపిశాచాలు ఆవహించాయి.

పాడుపడిన బావిలో ఉన్న త్రితుడు యజ్ఞముహూర్తం సమీపించిందని తెలిసి, రాళ్ళు కొట్టి నిప్పుచేసి, ఎండుటాకుల మంటచేసి, అదే తన యజ్ఞం అనుకున్నాడు.





అది పవిత్రస్థలం కాదు. అతని వద్ద యజ్ఞపరికరాలలో ఒకటీ లేదు. అయినా అతని దీక్షకు మెచ్చి దేవతలు ప్రత్యక్షమై అతన్ని వరం కోరమన్నారు.

"ఈ బావిని పునీతం చెయ్యండి. ఇందులో స్నానం చేసినవారు పవిత్రు లయేటట్టు అనుగ్రహించండి," అని త్రితుడు దేవతలను కోరాడు. వెంటనే బావిలోకి నీరు వచ్చి, అతన్ని పైకి ఎత్తింది.





అంతర్వాహినిగా ఉండిన సరస్వతీ నది త్రితుడి వరం ఫలితంగా పైకి వచ్చేసింది. అందరూ సంతోషించి, త్రితుణ్ణి ప్రశంసించారు.



# అష్టావక్రుడు

అష్టావక్రుడు ఏకపాదుడు అనే బ్రాహ్మణుడి కొడుకు. ఏకపాదుడి వద్ద చాలా మంది శిష్యులు చదువుకునేవారు. ఏకపాదుడు వారి చేత అహోరాత్రాలు విశ్రాంతి లేకుండా వేదాధ్యయనం చేయించేవాడు. ఏకపాదుడి భార్య సుజాత గర్భవతిగా ఉన్నది. ఆమె గర్భంలో ఉన్న శిశువు ఏకపాదుడితో, "నీ శిష్యులచేత నిద్రాహారాలు లేకుండా ఎందుకిలా చదివిస్తావు? వారి ఆరోగ్యం చెడిపోతున్నది," అని ఆక్షేపించాడు.

"అధ్యయనం గురించి ఇలా వక్రంగా మాట్లాడావు గనక అష్టవక్రాలతో పుట్టు!" అని ఏకపాదుడు తన కొడుకును శపించాడు.

సుజాతకు ప్రసవదినాలు సమీపిస్తున్నాయి. ఇంట్లో సంబారాలు లేవు. అందుకని ఏకపాదుడు ధన యాచనకుగాను జనకరాజు వద్దకు వెళ్లాడు. ఆయన లేని సమయంలో అష్టావక్రుడు పుట్టాడు.

అష్టావక్రుడి మేనమామ ఉద్దాలకుడు. సుజాత ఉద్దాలకుడి ఇంటనే అష్టావక్రుణ్ణి ప్రసవించింది. ఉద్దాలకుడికి శ్వేతకేతుడు అనే కొడుకు పుట్టాడు.

ఒకనాడు అష్టావక్రుడు తన మేనమామ తొడ మీద కూర్చున్నాడు. అది చూసి శ్వేతకేతుడు, "మా తండ్రి తొడ మీద నువు ఎందుకు కూర్చున్నావు? నీ తండ్రి తొడ మీద కూర్చో," అన్నాడు.

అష్టావక్రుడు తల్లిని, "నా తండ్రి ఎక్కడ ఉన్నాడు?" అని అడిగాడు.

"ధనం సంపాదించుకు వస్తానని నీ తండ్రి జనకుడి సభకు వెళ్ళాడు." అని తల్లి అష్టావక్రుడితో అన్నది.

వెంటనే అష్టావక్రుడు తన తండ్రికోసం జనకుడి సభకు వెళ్ళాడు. అక్కడికి

వెళ్ళగానే అతనికి తెలిసిన సమాచారం ఏమంటే, తన తండ్రి జనకరాజు సభలో వరుణుడి కొడుకైన వందితో వాదనకు దిగి, ఓడిపోయాడట; ఆ కారణంగా ఏకపాదుణ్ణి నీటిలో ముంచారట! ఏకపాదుడితో బాటు, వందితో ఓడిపోయిన వారందరూ నీటిలో మునిగి ఉన్నారు.

అష్టావక్రుడు రాజసభకు పోయి, వందిని తనతో వాదించమని సవాలు చేశాడు. ఇద్దరూ వాదించుకున్నారు. వంది ఓడాడు. గెలిచినందుకు బహుమానంగా తన తండ్రినీ, నీటిలో ముంచి ఉన్న ఇతరులనూ విడిపించమని అష్టావక్రుడు కోరాడు. ఈ విధంగా అష్టావక్రుడు తనను శపించిన తండ్రిని అవమానం నుంచి రక్షించాడు.

అష్టావక్రుడు వదాన్యుడి కూతురైన సుప్రభ అనేదాన్ని పెళ్ళాడ గోరాడు. తాను పెట్టే పరీక్షలో నెగ్గితే సుప్రభను అష్టావక్రుడికి ఇచ్చి పెళ్లి చేస్తానన్నాడు వదాన్యుడు. హిమాలయాలలో ఒక స్త్రీ కనిపిస్తుందనీ, ఆమెను చూసి రమ్మనీ వదాన్యుడు అష్టావక్రుణ్ణి అడిగాడు.

అష్టావక్రుడు హిమాలయాలకు పోతూ కుబేరుడి అతిథిగా ఆగాడు. కుబేరుడు అతనికి గొప్పగా అతిథిసత్కారాలు చేసి, నృత్య గాన వినోదాలు ఏర్పాటు చేశాడు. ఒక ఏడాది గడిచింది.

తరవాత అతను వదాన్యుడు చెప్పిన స్త్రీని కలుసుకున్నాడు. ఆమె అతనికి తన బంగారు ఇంట ఆతిథ్యమిచ్చి, అతన్ని వశపరచుకొన యత్నించింది. కాని అష్టావక్రుడు లొంగలేదు. తనను పెళ్ళాడమని ఆమె అతన్ని అడిగింది.

"నిన్ను నువే ఎలా ఇచ్చుకుంటావు? నీ తండ్రి ఎవరు? ఆయన ఇస్తే నిన్ను పెళ్ళాడగలను," అన్నాడు అష్టావక్రుడు.

అప్పుడామె అసలు సంగతి బయట పెట్టింది. వదాన్యుడు అష్టావక్రుణ్ణి పరీక్షించటానికి ఆమెను సృష్టించాడు. పరీక్షలో అష్టావక్రుడు నెగ్గాడు. అతను తిరిగి వచ్చి, సుప్రభను పెళ్ళాడాడు.






పూర్వం గొప్ప ధనవంతుడైన వైశ్యుడుండే వాడు. ఆయనకు సుబుద్ధి అనే ఒక కుమారుడూ, సుమిత్ర అనే కుమార్తె ఉండే వారు. ఆయన చనిపోతూ తన కొడుకుని దగ్గిరికి పిలిచి, "నాయనా, నా అనంతరం మన వ్యాపారం చక్కగా సాగించు. నీవూ, చెల్లెలూ సఖ్యతగా ఉండండి. ఇదే నా తుది కోరిక," అని చెప్పాడు.

తండ్రి పోయిన కొద్ది కాలానికే సుబుద్ధి మూడు నౌకల మీద సరుకులు వేసుకుని దేశాంతరాలకు బయలుదేరాడు. బయలు దేరేటప్పుడు అతను తన చెల్లెలితో, "చెల్లీ, నేను చాలాకాలానికి గాని తిరిగి రాను. నేను లేని సమయంలో నీవు నీ ధర్మాన్ని అతిక్రమించవద్దు. పరులతో ప్రసంగించవద్దు," అని చెప్పాడు. తిరిగి ఎప్పుడు కలుసుకుంటామోనని సుబుద్ధి తన చిత్తరువును తన చెల్లెలి కిచ్చి ఆమె చిత్తరువును తన వెంట తీసుకొని నౌకలతో సముద్రం మీద బయలుదేరాడు.

రెండేళ్లు గడిచాయి. మూడోయేడు నడుస్తోంది. సుబుద్ధి నౌకలు ఒకానొక రేవుపట్టణం చేరుకొన్నాయి. అక్కడ లంగరు దించి, తన వెంట ఒక గిన్నెలో రత్నాలూ, రత్నకంబళాలూ మొదలైన బహుమానాలు తీసుకొని సుబుద్ధి ఆ దేశపు రాజు సుదర్శనుడి వద్దకు వెళ్లాడు.

తాను తెచ్చిన బహుమతులు సుదర్శనుడికి సమర్పించి, "తమ దేశంలో వ్యాపారం చేసుకోవటానికి అనుమతి ఇవ్వండి," అని సుబుద్ధి అడిగాడు.

సుబుద్ధి తెచ్చిన బహుమానాలు చూసి సుదర్శనరాజు చాలా ఆనందించాడు. ఏ వణిజుడు కూడా తన కలాటి అమూల్యమైన బహుమతులిచ్చివుండలేదు. అందు



చేత సుదర్శనుడు సుబుద్ధి కోరిన ప్రకారం వ్యాపారం చేసుకునేటందుకు అనుమతి నివ్వటమేగాక, అతను నౌకలో తెచ్చిన వస్తువులను చూడటానికి సపరివారంగా రేవుకు కూడా వచ్చాడు.

నౌకలోని వస్తువులను చూసి ఆనందిస్తున్న సుదర్శనరాజు కన్ను సుమిత్ర చిత్తరువుపై పడింది.

"ఎవ్వరీ సౌందర్యవతి?" అని సుదర్శనరాజు సుబుద్ధిని అడిగాడు.

"ప్రభూ, ఆమె నా చెల్లెలు."

"అలాగా! అందానికి తగిన శీలం కూడా ఆమె కున్నదా?" అని అడిగాడు సుదర్శన రాజు.

"ఆమె శీలానికి వంక పెట్టగలవారు లేరు." అన్నాడు సుబుద్ధి.

"అయితే నే నామెను నా పట్ట మహిషిగాచేసుకుంటాను." అన్నాడురాజు.

ఇదంతా ఆలకిస్తున్న సేనానికి అసూయ జనించింది.

"చివరకు ఈ వైశ్యాంగన మాకు రాణి కావటమా? మా భార్యలు ఈమెకు సేవ చేయటమా?" అనుకున్నాడు దుర్మార్గుడైన సేనాని, అతను పైకి మాత్రం ఈ విధంగా అన్నాడు:

"ప్రభూ! ఈ స్త్రీని నేను బాగా ఎరుగుదును, ఈమె దుశ్శీల."

ఈ మాట వినగానే సుదర్శనుడికి సుబుద్ధిపై ఆగ్రహం కలిగింది.

"దుశ్శీలను శీలవతి అని ఎందుకు చెప్పావు? నీ తల తీయించేస్తాను." అన్నాడు రాజు సుబుద్ధితో.

"ప్రభూ! మీ సేనాని చెప్పేది అసత్యం. చేతనైతే అతను ఆ మాటలు రుజువు చేసుకోమనండి. నా చెల్లెలిని ఎరుగుదునంటున్నాడు కాబట్టి, ఆమె వేలిముద్రికను తీసుకురమ్మనండి. ఆమె పుట్టుమచ్చ ఎక్కడ వున్నదీ తెలుసుకు రమ్మనండి." అన్నాడు సుబుద్ధి.

సుదర్శనుడికి ఇది న్యాయంగానే తోచింది. ఆయన తన సేనానితో, "రెండు

నెలల కాలంలోగా నీవు ఈ స్త్రీ ఉంగ రమూ, పుట్టుమచ్చ రహస్యమూ తెలుసు కొనలేక పోయినట్టయితే నీ తల తీయిం చేస్తాను,'' అని తెలియపరిచాడు.

సేనాని వెంటనే ప్రయాణమై సుమిత్ర ఉండే దేశానికి వచ్చాడు. అక్కడ ఒక పేదరాసి పెద్దమ్మ వద్దకు వెళ్ళి తన పని చెప్పి, "పెద్దమ్మా, నా కా పిల్ల పుట్టు మచ్చ రహస్యమూ, ఉంగరమూ తెచ్చి పెడితివా, నీకు అంతులేని బంగారం ఇస్తాను,'' అని ఆశపెట్టాడు.

పేదరాసి పెద్దమ్మ ధనాశచేత సుమిత్ర ఇంటికి వెళ్ళి ఆమెతో ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పి, ఆమె వీపుమీద ఎడమ వైపున పుట్టుమచ్చ ఉన్నట్టు తెలుసుకొని, ఆమె ఉంగరాన్ని కూడా తస్కరించి తెచ్చి సేనాని కిచ్చింది.

సేనాని వెంటనే ప్రయాణం కట్టి స్వదేశానికి తిరిగి వచ్చి, సుదర్శనుడికి సుమిత్ర ఉంగరమూ, పుట్టుమచ్చ రహస్యమూ తెలియజేశాడు. సుమిత్రపై వేసిన అపవాదును సేనాని రుజువు చేశాడు గనక సుదర్శనుడు కోపంతో సుబుద్ధికి మరణదండన విధించాడు.

కాని సుబుద్ధి ఒక కోరిక కోరాడు:

"నేని దూరదేశంలో మరణించే ముందు ఒకసారి నా చెల్లెలిని చూడాలని ఉన్నది. ఆమెను పిలిపించి ఒక్కసారి కలుసుకోనివ్వండి. తరువాత నిశ్చింతగా మరణదండన అనుభవిస్తాను.''



దీనికి సుదర్శనుడు అంగీకరించాడు. సుబుద్ధి తన చెల్లెలి కొక జాబు వ్రాసి సుదర్శనుడి దూతల ద్వారా ఆమెకు పంపాడు. తన అన్న చెప్పినట్టు నడుచు కోక పేదరాసి పెద్దమ్మతో మాట్లాడి నందుకు ప్రమాదం సంభవించిందని తెలుసుకొని సుమిత్ర తన అన్నను కలుసు కోవటానికి బయలుదేరింది.

సుదర్శనుడి రాజ్యం చేరుకోగానే ఆమె తిన్నగా రాజు వద్దకు వెళ్ళి, "ప్రభూ, ఈ కర్ణాభరణం చూడండి. ఇది విలు వయినదేనా?" అని అడిగింది.

సుదర్శనుడు ఆమె ఇచ్చిన కర్ణా భరణంలోని రత్నాలను పరీక్షించి, "నిశ్చయంగా ఇది అమూల్యమైనదే. కాని దీనిని నా కెందుకు చూపుతున్నావు?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"తమ సేనాని దీని జతను నా వద్ద తస్కరించాడు. తాము ధర్మస్వరూపులు, అది నాకు తిరిగి ఇప్పించండి!" అన్నది సుమిత్ర దీనంగా.

రాజు సేనానిని పిలిపించి, సుమిత్ర చేసిన ఆరోపణను చెప్పి, "ఆమె కర్ణా భరణం దొంగిలించావట. దానిని వెంటనే ఆమెకు తిరిగి ఇచ్చెయ్యి." అన్నాడు.

సేనాని నిర్ఘాంతపోయి, "ప్రభూ, అసలీమె ఎవరో నే నెరగను. నా జన్మలో ఎన్నడూ నే నీమె ముఖమైనా చూసి ఉండలేదు. నే నీమె కర్ణాభరణం దొంగి లించట మేమిటి?" అన్నాడు.

వెంటనే సుమిత్ర రాజువైపు తిరిగి, "ప్రభూ! నేను సుబుద్ధి చెల్లెలు సుమిత్రను. నన్ను మీ సేనాని తన జన్మలో ఎన్నడూ చూసి ఉండకపోతే మా అన్నకు తమరు మరణదండన ఎందుకు విధించారు?" అని అడిగింది.

తన సేనాని చేసిన మోసమూ, సుమిత్ర చేసిన యుక్తీ సుదర్శనుడికి అర్థమై పోయింది. ఆయన తన సేనానికి మరణదండన విధించి, సుబుద్ధిని ఖైదు విడిపించి, సుమిత్రను పెళ్లాడి చాలా కాలం సుఖంగా రాజ్యం చేశాడు.






చిన్నతనం నుంచీ చంద్రహాసుడు అనే వాడికి రాజు కావాలని ఉండేది. అలాటి కోరికతో అతను కష్టపడి చదువుకుని రాచవిద్యలన్నీ అభ్యసించాడు; కొందరు యువకులకు తనలో విశ్వాసం కలిగించి, వారిని తన అనుచరులుగా చేసుకున్నాడు. నిర్జనప్రాంతంలో నగరం నిర్మించి; దానికి రాజు కావాలని చంద్రహాసుడి కోరిక.

"రాజధాని నిర్మించేటప్పుడు స్థల ప్రభావం చూడడం అవసరం,'' అన్నాడు చంద్రహాసుడితో అతని పురోహితుడు.

చంద్రహాసుడు అలాటి స్థలంకోసం వెతకగా, వెతకగా చిట్టచివరకు ఒక చోటు కనబడింది. అతను చూస్తూండగా ఆ ప్రదేశానికి వేటకుక్కలు కుందేళ్లను తరుముకుంటూ వచ్చాయి. ఆ ప్రదేశానికి చేరుతూనే కుందేళ్లు పారిపోవడం మాని, వేటకుక్కల మీద తిరగబడి; వాటిని తరిమేశాయి! చంద్రహాసుడు ఆ స్థలంలో తన రాజధాని కట్టించి, దానికి కుందేలు నగరం అని పేరు పెట్టాడు. దానికి రాజు చంద్రహాసుడు. ఆ నగరం లవంగదేశపు సరిహద్దున ఉండడం వల్ల, ఆ దేశపు రాజు చంద్రహాసుడి పైకి యుద్ధానికి వచ్చాడు. కుందేలు నగరం దుర్భేద్యంగా నిర్మించబడింది. నగరంలో ఉన్న సైనికులు కొద్దిమందే అయినా, తమకు అపజయం లేదన్న నమ్మకం గల వాళ్లు. యుద్ధంలో చివరకు లవంగదేశపు రాజు ఓడిపోయాడు.

కాలక్రమాన చంద్రహాసుడి రాజ్యపు పొలిమేరల మీద ఉన్న రాజులందరూ అతనికి ఓడిపోయారు. అతని రాజ్యం విస్తరించింది. అతను చక్రవర్తి అయాడు.

చంద్రహాసుడి కొడుకు పద్మసేనుడు సరిగా విద్యాభ్యాసం చెయ్యక, యుక్త

వయస్కుడయే సమయానికి అవలక్షణా లన్నీ అలవరచుకున్నాడు.

ఈస్థితిలో, చంద్రహాసుడు హఠాత్తుగా గుండె ఆగి మరణించాడు. పద్మసేనుడు రాజు అయాడు. కాని అతనికి రాచరికపు బాధ్యతలు నిర్వహించే సామర్థ్యం లేదు. అందుగురించి అతను భయపడుతూంటే, "కుందేలు నగరం స్థలప్రభావం వల్ల మన కేమీ భయంలేదు," అని మంత్రి కుమారుడు ధైర్యం చెప్పాడు.

తమ చక్రవర్తి అసమర్థుడని సామంతు లకు త్వరలోనే తెలిసి వచ్చింది. లవంగ దేశపు సామంతుడు పెద్ద సేనతో కుందేలు నగరంమీదికి దండెత్తి వచ్చాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో పద్మసేనుడు చిత్తుగా ఓడిపోయి, మంత్రి కుమారుడితో కలిసి రహస్యంగా అడవుల్లోకి పారిపోయాడు.

"స్థలప్రభావం వల్ల రాజ్యం సంపా దించి, నా తండ్రి చక్రవర్తి కాగలిగాడు. కుందేళ్ళ చేత వేటకుక్కలను తరిమి కొట్టించిన స్థలప్రభావం నన్ను ఏ మాత్రం కాపాడలేక పోయింది. నేను కుందేళ్ళ కన్న అసమర్థుణ్ణి!" అని అతను విచారించాడు.

అతనికి ఉపశమనం కలిగించే ఉద్దే శంతో మంత్రికొడుకు, "విచారించకండి, ప్రభూ! మీరు ఓడిపోవటానికి కారణం స్థలప్రభావమే గాని, మీ అసమర్థత కాదు! అక్కడి దాకా కుందేళ్ళను తరుము కుంటూ వచ్చిన వేటకుక్కలు, అక్కడికి రాగానే తిరుగుముఖం పట్టినవంటే, కుందేళ్లకు ధైర్యాన్ని ప్రసాదించిన స్థలమే వేటకుక్కలకు అధైర్యం కలిగించిందన్న మాట! మీరు మహాపరాక్రమశాలి కనకనే స్థలప్రభావం మీ ప్రతాపాన్ని నశింప జేసింది. కుందేలులాటి లవంగదేశపు రాజు గెలిచాడు!" అన్నాడు.

స్థలప్రభావం రెండు వైపులా పదును గల కత్తి అయినప్పుడు దాన్ని నమ్ము కోవటంకన్న, మనుషుల శక్తిసామర్థ్యాలనే నమ్ముకోవటం మంచిదని పద్మసేనుడు గ్రహించాడు.






వెంకయ్య కూతురు సుజాతకు పెళ్ళి అయి, ఇంకా కాపరానికి పోలేదు. ఇంతలో సంక్రాంతి వచ్చింది. పండగకి తన అల్లుణ్ణీ, వియ్యంకుడు సుబ్బయ్యనీ వెంకయ్య తన ఇంటికి రావలసిందిగా ఆహ్వానించాడు. సుబ్బయ్య భార్యనూ, కొడుకునూ వెంట బెట్టుకుని వెంకయ్య ఇంటికి వచ్చాడు.

వెంకయ్య ఐశ్వర్యవంతుడేమో, అతని లోగిలి చాలా పెద్దది. అది అందంగా కూడా ఉన్నది. ఇంటి నిండా పని మనుషులు, పిలిచిన మరుక్షణం హాజరవుతారు. సుబ్బయ్యకు వెంకయ్య చాలా చక్కగా మర్యాద చేశాడు.

మర్నాడు ఉదయం సుబ్బయ్య నిద్ర లేస్తూనే దొడ్లో ఏదో గొడవ జరగటం వినిపించింది. మొదట సుబ్బయ్య తనకెందుకు లెమ్మనుకున్నాడు. కాని అంతకంతకూ కేకలు తీవ్రం అవుతున్నట్టు తోచి, సుబ్బయ్య దొడ్లోకి తొంగిచూశాడు. అక్కడ వెంకయ్య పనివాళ్ళ మీద తెగ అరుస్తున్నాడు.

వెంకయ్యను పనివాళ్ళు ఏమాత్రమూ లక్ష్యపెట్టుతున్నట్టు లేరు. అంత సంపన్నుడైన యజమాని పట్ల పనివాళ్ళకు భయభక్తులు లేకపోవటం సుబ్బయ్యకు ఆశ్చర్యం కలిగించింది. చివరకు వెంకయ్య భార్య స్వయంగా జోక్యం కలిగించుకుని సర్దుబాటు చేస్తేగాని గొడవ ఆగిపోలేదు.

"ఇంట్లో బంధువులు కూడా ఉన్నారు! ఎంత అసహ్యం?" అని ఆమె కోపంగా వెంకయ్యతో అనటం సుబ్బయ్య విన్నాడు.

తప్పు వెంకయ్యలోనే ఉన్నట్టు సుబ్బయ్యకు స్పష్టమయింది. ఆయన

కొంపల్లి రాధామణి

పనిమనుషుల మీద చీటికీ, మాటికీ నోరు పారేసుకుంటూ, వాళ్ళకు తన మీద గౌరవం లేకుండా చేసుకున్నాడని సుబ్బయ్య గ్రహించాడు.

కొంతసేపటికి వెంకయ్య సుబ్బయ్య వద్దకు వచ్చి, "వెధవలు సరిగా పని చెయ్యరు! మహా విసిగిస్తున్నారు, బావ గారూ!" అన్నాడు.

సుబ్బయ్య, "నిజమేనండీ!" అన్నాడు. కాని వెంకయ్యలోని లోపం గురించి ప్రస్తావించలేదు. ఆయన మంచి లౌకికుడు. ఆయన కూడా, లక్షాధికారి కాకపోయినా, బాగా ఉన్నవాడే. ఆయన ఇంట్లో కూడా ముగ్గురు, నలుగురు నౌకర్లున్నారు. వారితో ఆయన ఎన్నడూ ఘర్షణపడడు, వారిని అల్లరిపెట్టడు. వాళ్ళకు తమ యజమాని అంటే భయమూ, భక్తీ ఉన్నాయి.

సుబ్బయ్య ఉన్న నాలుగు రోజులూ వెంకయ్య తన పనివాళ్ళ మీద చీటికీ, మాటికీ అరుస్తూనే ఉన్నాడు. ఎలాగైనా తన వియ్యంకుణ్ణి సరిదిద్దాలనిపించింది సుబ్బయ్యకు.

పండగ గడిచి, తాను తన కోడలిని కాపరానికి తీసుకుపోయేటప్పుడు సుబ్బయ్య వెంకయ్యనూ, అతని భార్యనూ తమ ఇంటికి ఆహ్వానించాడు. వెంకయ్య సరే నన్నాడు.

సుబ్బయ్య ఇల్లు అంత పెద్దది కాక పోయినా, శుభ్రంగా ఉన్నది. గృహాలంక



రణలు బాగున్నాయి. ఇంటి ముందున్న పూలతోటా, పెరట్లో ఉన్న కూరలపాదులూ ఇంటి పనివాళ్ళే చూస్తారు. పనివాళ్ళు ఇంటివాళ్ళ లాగే అతిథులను కూడా ఎంతో మర్యాదగా కనిపెట్టి ఉండి, ఇంటి మనుషుల్లాగా ప్రవర్తిస్తారు. యజమానులకూ, పనివాళ్ళకూ ఘర్షణరావటం వెంకయ్య గాని, అతని భార్య గాని చూడ లేదు. పనివాళ్ళు తన వియ్యంకుడికి అంత విధేయత చూపటానికి ఆయన ఏం చేస్తాడో వెంకయ్య ఊహించలేక పోయాడు.

ఒకరోజు సుబ్బయ్య తన గదిలో వెంకయ్యతో మాట్లాడుతూ గది ఊడ్చినట్టు లేదన్న సంగతి గమనించాడు. పని మనుషుల మీద కొంచెం కోపం కూడా వచ్చింది; కాని ఎవరినీ పిలిచి కసురుకో లేదు. ఇంతలో ఒక నౌకరు అటుగా వచ్చాడు.

"ఒరే, ఆ బీరువాను అక్కడినుంచి తీసి, ముందు గదిలో పెట్టండి," అంటూ సుబ్బయ్య గదిలో ఒక మూలవున్న చీపురుకట్ట తీసుకుని, గదిని తానే శుభ్రంచెయ్యసాగాడు.

వెంటనే పనివాడు, "బాబు, బాబు! మీరు ఊడ్చటమేమిటి? పొరపాటున ఈ గది శుభ్రంచెయ్యటం మరిచిపోయాం. క్షమించండి!" అంటూ సుబ్బయ్య చేతిలో నుంచి చీపురుకట్ట తీసుకుని, వాడే ఊడ్చసాగాడు.

అదే సుబ్బయ్యకు కావలిసింది కూడా. వెంకయ్య సుబ్బయ్య లౌక్యం గ్రహించి, "బావగారూ, పనివాళ్ళ కన్న మనమే ఎక్కువ నేర్పుగా ప్రవర్తించాలన్నది ఇప్పుడే గ్రహించాను. మాటల్లో కన్న చేతల్లో చెబితే పనివాళ్ళు ఎక్కువ పొరపాట్లు చెయ్యటం మానేస్తారు," అన్నాడు నవ్వుతూ.

"మీరైనా పనివాళ్ళతో ఇలాగే పని చేయించుకోవచ్చు. వాళ్ళతో ఘర్షణ పడటం అనవసరం," అన్నాడు సుబ్బయ్య తాను కూడా నవ్వుతూ.





# తీరిన ఋణం

ఒక ఊళ్ళో ఒక గొడారి ఉండేవాడు. వాడికి ఒక్కతే కూతురు. వాడు కష్టపడి పని చేసి, తన రాబడిలో కూతురు పెళ్ళి కోసం సాధ్యమైనంత వెనక వేస్తూ, పెళ్లి ఖర్చులకు తగినంత పోగుచేశాడు.

గొడారివాడి కూతురికి సంబంధం కూడా కుదిరింది. కాని ముహూర్తం రెండు రోజు లున్నదనగా, వాడి ఇంట దొంగలు పడి, వాడు ఎంతకాలంగానో దాచి ఉంచిన డబ్బంతా దోచుకుపోయారు. కూతురి పెళ్లి భగ్నమయినందుకు వాడు నేలమీద పొర్లిగింతలు పెట్టుతూ, ఏడవ సాగాడు.

ఆ సమయానికి అటుగా పోతున్న భూషయ్య అనే మోతుబరిరైతు, గొడారి వాడి పరిస్థితి తెలుసుకుని, "నువ్వు పోగొట్టుకున్న డబ్బు నేనిస్తా: కాని నా బాకీ త్వరలో తీర్చెయ్యాలి," అన్నాడు.

భూషయ్యను అందరూ నరరూప రాక్షసుడుగానూ, రాతిగుండెగల మనిషి గానూ ఎంచేవారు. అయినా ఆ క్షణంలో గొడారి వాడికి ఆ భూషయ్యే దేవుడులాగా కనిపించాడు. వాడు ఆనంద పారవశ్యంలో భూషయ్య కాళ్ళమీద పడి, "నా చర్మంతో చెప్పులు కుట్టించి అయినా మీ ఋణం తీర్చుకుంటా, బాబూ!" అన్నాడు.

భూషయ్య గ్రామాధికారి ఎదట పత్రం రాసి, గొడారివాడిచేత వేలిముద్ర వేయించి, డబ్బు ఇచ్చాడు. పదిమందీ చేరి, గొడారివాడి కూతురి పెళ్లి జరిపించేశారు.

పదిరోజులు గడిచాక భూషయ్య గొడారిని తన బాకీ తీర్చమన్నాడు.

"పది రోజులలో అంత డబ్బు నే నెలా చేర్చగలను, బాబూ?" అన్నాడు గొడారి.

షేక్ గాలిబ్

"నాకు అదంతా తెలీదు. రేపటిలోగా నా బాకీ తీర్చకపోయావో, నీ భార్యాబిడ్డల చేత వెట్టిచాకిరీ చేయించుకుంటాను, నీ ఇల్లు స్వాధీనం చేసుకుంటాను. అదేదీ కాకపోతే నీ చర్మంతో నాకు చెప్పులు కుట్టించి అయినా ఇయ్యి," అని భూషయ్య వెళ్ళిపోయాడు.

మళ్ళీ గొడారి వాడికి ప్రాణం మీదికి వచ్చినట్టు అనిపించింది. వాడి బాధ చూడలేక, వాడి పొరుగువాళ్ళు, "గ్రామాధికారినే సలహా అడుగు. ఆయన బీద వాళ్లకు సాయంచేస్తాడు," అన్నారు.

గొడారి గ్రామాధికారి దగ్గిరికి వెళ్ళి, భూషయ్య కొత్త ఎత్తు గురించి చెప్పి, "బాబూ, నన్ను ఈ పరిస్థితిలో దొంగతనం చెయ్యమన్నారా? వెట్టి చెయ్యమన్నారా? నన్ను ఎలా ఒడ్డునపడేస్తారో, మీదే భారం!" అన్నాడు.

గ్రామాధికారికి భూషయ్య తత్వం తెలుసు. ఆయనకు గొడారి మీద జాలి కూడా వేసింది. ఆయన కొంచెం ఆలోచించి, గొడారికి ఒక సలహా ఇచ్చి, అలా చెయ్యమన్నాడు.

"ఆయన గొడవపెడితే ఏం చెయ్యమన్నారు?" అని గొడారి అడిగాడు.

"నా దగ్గిరికి తీసుకురా. సాక్ష్యానికి నీ వియ్యంకుణ్ణి కూడా వెంటపెట్టుకురా!" అన్నాడు గ్రామాధికారి.

తాను పెట్టిన గడువుకు గొడారి బాకీ చెల్లించకపోయేసరికి, భూషయ్య అప్పు



కాగితం తెచ్చి చూపి, గ్రామాధికారి దగ్గిర ఫిర్యాదు చేశాడు.

గ్రామాధికారి గొడారిని పిలిచి, "భూషయ్యగారి బాకీ తీర్చటం కోసం మీ ఇంటిల్లిపాదీ భూషయ్యగారికి వెట్టి చాకరీ చేస్తారా? లేక నీ ఇల్లు అమ్మేసి బాకీ తీర్చుతావా? అదీ కాకపోతే నీ చర్మంతో వారికి చెప్పులు కుట్టించి ఇస్తావా?" అని అడిగాడు.

"నా చర్మంతో చెప్పులు కుట్టించి ఇస్తాను, బాబూ," అన్నాడు గొడారి.

"అందుకు సమ్మతమేనా?" అని గ్రామాధికారి భూషయ్యను అడిగాడు.

"సమ్మతమే," అన్నాడు భూషయ్య.

వెంటనే గొడారి మూట విప్పి, ఒక చెప్పుల జత తీసి భూషయ్య ముందు పెట్టి, "ఇక మీ బాకీ చెల్లు!" అన్నాడు.

భూషయ్య మండిపోయి, "ఒరేయ్, నీ అతితెలివి నా ముందు చూపించకు. నీ చర్మంతో చెప్పులు కుట్టుతానని చెప్పి, జంతువు చర్మంతో కుట్టిన చెప్పులు ఇస్తావా? చూడండి, గ్రామాధికారిగారూ, వీడు నన్ను ఎంత తెలివితక్కువవాడి కింద జమ కట్టాడో!" అన్నాడు.

గ్రామాధికారి భూషయ్య మాటలకు ఆశ్చర్యపోయినట్టు కనబడుతూ, "గొడారి అతితెలివి ఏం చూపించాడూ? వాడు చెప్పులు కుట్టిస్తానన్నది వాడి చర్మంతోనే గాని, వాడి వంటి మీది చర్మంతో కాదే! ఆ చర్మం వాడు కొన్న జంతువులదైతే వాడిదే గదా! దానికి మిమ్మల్ని డబ్బు అడగలేదుగదా! ఆ చెప్పులు ఇచ్చి వాడు ఋణవిముక్తి పొందాడు. ఇలా జనాన్ని ఇంకోసారి పీడిస్తే తీవ్రంగా చర్యతీసుకోవలసి వస్తుంది," అన్నాడు.

గ్రామాధికారి దయవల్ల గొడారి ఒడ్డున పడ్డాడు. వాడు గ్రామాధికారికి మంచి చెప్పుల జత కుట్టి ఇచ్చి తన కృతజ్ఞత తెలుపుకున్నాడు. భూషయ్య ఆట ఒక గొడారివాడు కట్టించాడని ఊరంతా తెలిసిపోయింది. అతను అటు తరవాత ఎవరినీ పీడించలేదు.






దనవుడి కొడుకులు రంభుడూ, కరంభుడూ అనే వాళ్ళు తమకు పిల్లలు లేని కారణంగా చాలాకాలం తీవ్ర తపస్సు చేశారు. కరంభుడు పంచనద తీర్థంలో మునిగి తపస్సు చేశాడు. రంభుడు ఒక చెట్టు మీద ఎక్కి తపస్సు చేశాడు.

ఎవరు తపస్సు చేస్తున్నా ఇంద్రుడికి ముచ్చెమటలు పోస్తాయి. అందుచేత అతను మొసలి రూపంలో పంచనదంలో ప్రవేశించి, కరంభుణ్ణి చంపేశాడు. తన తమ్ముడి చావుకు రంభుడు శోకావేశంతో అగ్నిహోత్రుడికి తన తల అర్పించటానికి చేత్తో కత్తి ఎత్తాడు.

అప్పుడు అగ్ని ప్రత్యక్షమై, "ఎందుకు ఆత్మహత్య చేసుకుంటున్నావు? దానివల్ల ఇహమా, పరమా? నీ తపస్సు చూసి నేను సంతోషించాను. కోరుకో, వరం ఇస్తాను," అన్నాడు.

"దేవా, నీకు నా మీద అనుగ్రహం ఉంటే నాకు ఒక కొడుకును ఇయ్యి. వాడు కామరూపీ, దేవతలకుగాని, దానవులకు గాని, మానవులకుగాని జయించరానివాడుగా ఉండాలి!" అన్నాడు రంభుడు.

"అలాగే అవుతుంది. నీకు ఎవతె మీద ప్రీతి ఉంటే దానివల్ల నువు కోరిన కొడుకు కలుగుతాడు," అని అగ్నిహోత్రుడు అదృశ్యమయాడు.

రంభుడు తిరిగి వస్తూ, యక్షుల అధీనంలో ఉన్న ఒక అందమైన ప్రదేశంలో

**14. మహిషాసుర వధ**



ఒక ఆడ గేదెను చూశాడు. అతనికి దాని మీద మోహం కలిగింది. ఆ మహిషి రంభుడి వల్ల గర్భం ధరించి, అతని వెంట పాతాళానికి వచ్చేసింది.

అక్కడ ఆ మహిషిని మరొక మహిషం మోహించింది. అది చూసి రంభుడు ఆగ్రహావేశంతో దాన్ని కొట్టాడు. ఆ మహిషం (దున్నపోతు) రంభుణ్ణి తన కొమ్ములతో పొడిచి పైకెత్తి, చంపేసింది. అది చూసి మహిషి రంభుడితోపాటు చితిమంటలలో కాలిపోయింది. ఆ మంటల నుంచి ఇద్దరు రాక్షసులు వెలువడ్డారు. ఒకడు మహిషుడు, ఇంకొకడు రక్తబీజుడు.

రాక్షసులు మహిషాసురుణ్ణి తమ రాజుగా ఎన్నుకున్నారు. అతని కింద చిక్షురుడూ, తామ్రుడూ, అసిలోముడూ, సుదర్కుడూ, బిడాలుడూ, బాష్కలుడూ, త్రిణేత్రుడూ, కాలబంధకుడూ అనేవాళ్లు సేనాపతులు. వారి సహాయంతో మహిషాసురుడు భూలోకమంతా ఏలుతూ, యజ్ఞకర్మలను ధ్వంసం చేస్తూ వచ్చాడు. ఇతని కాలంలో దేవతలకూ, దానవులకూ మహా భయంకరమైన యుద్ధం జరిగింది.

ఇది జరగక పూర్వం మహిషుడు కాంచన పర్వతం మీద గొప్ప తపస్సు చేసి, బ్రహ్మదేవుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, "మహాత్మా, నాకు చావు లేకుండా చెయ్యి." అని వరం కోరాడు.

దానికి బ్రహ్మ, ''పుట్టిన వాళ్ళంతా చావక తప్పదు, చచ్చినవాళ్ళు పుట్టకా తప్పదు. చావకుండా నీకు వరం ఎలా ఇయ్యగలను? భూమికీ, సముద్రానికీ, కొండలకూ సైతం నాశనం ఉన్నది గదా! చచ్చిపోవటానికి అవకాశం వదిలి వరం కోరుకో, అలాగే ఇస్తాను,'' అన్నాడు.

అప్పుడు మహిషుడు, ''ఆడది ఎలాగూ నన్ను చంపలేదు గనక, దేవతలలోగాని, దానవులలోగాని, మానవులలోగాని ఏ పురుషుడి చేతా నాకు చావు లేకుండా అనుగ్రహించు,'' అని బ్రహ్మను కోరాడు.

"అలాగే. కాని నీకు ఎప్పటికైనా స్త్రీ మూలంగానే చావు వస్తుంది." అని బ్రహ్మ వెళ్ళిపోయాడు.

ఈ వరం పొంది ఉన్న మదంతో మహిషుడు స్వర్గాన్ని ఆక్రమించాలన్న ఉద్దేశంతో ఒక సేవకుణ్ణి పిలిచి, "ఇంద్రుడు నాతో యుద్ధమే చేస్తాడో, నా శరణుజొచ్చి నాకు స్వర్గం ఇచ్చేస్తాడో స్పష్టంగా కనుక్కురా," అన్నాడు.

మహిషుడి దూత స్వర్గానికి వెళ్ళి ఇంద్రుణ్ణి చూసి, "దేవేంద్రా, నేను మహిషుడి దూతను. ఆయన పంపగా నిన్ను అడగవచ్చాను: నువు లేనిపోని అతిశయాలకు పోక, నీ నగరాన్ని మహిషుడి వశంచేసి, ఆయన సేవకుడవుగా ఉంటావా? లేక ఆయనతో యుద్ధానికి దిగుతావా? ఏదో ఒక నిర్ణయంచేసి చెప్పు." అన్నాడు.

"ఓరి మదాంధుడా! నీ యజమానికి అంతగా కళ్ళు నెత్తికి వచ్చాయిగా! నా ఎదటికి వచ్చి నాతో ఇలా మాట్లాడతావా? వాడి సంగతి నేను చూస్తాను. దూతవు గనగ బతికావు! నువు తిరిగి వెళ్లి నేను చెప్పానని ఇలా చెప్పు! 'ఒరే దున్నపోతా! యుద్ధంలో నన్ను జయించాలన్న కోరిక నీకు పుట్టిందా? గడ్డి తెగమేసి, కొవ్వి ఉన్నావా? నువు మొద్దు



స్వరూపమని నాకు తెలుసు. నీ కొమ్ములు పీకి ధనుస్సు చేసుకుంటాను, ఏమనుకున్నావో?' " అన్నాడు ఇంద్రుడు.

దూత మహిషుడి వద్దకు తిరిగి వెళ్ళి, "ఇంద్రుడు నిన్ను లక్ష్యపెట్టక, ఏమేమి పేలాడో చెప్పటానికి నాకు భయంగా ఉన్నది. నీకు తృప్తి కలగటానికి అబద్ధం ఎలా చెప్పను?" అంటూ ఇంద్రుడి సందేశం చెప్పకుండా చెప్పాడు.

మహిషుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను తోక జాడించి, ఎర్రని కళ్లు తిప్పుతూ, "ఈ ఇంద్రుణ్ణి చంపాలా, వద్దా? వాడనగా ఎంత? వాడి ప్రతాపం మెత్తని వాళ్ళ దగ్గిరా, ముక్కుమూసు



అతను అష్టదిక్పాలకులనూ, దేవతలనూ జయించి, వారనుభవించే సుఖాలన్నీ రాక్షసులకు అందజేయ నిశ్చయించి, తన సేవకులతో, ''నన్ను ఏ మగవాడూ జయించలేడు. మీరు ఎక్కడెక్కడ ఉన్న రాక్షసులనూ యుద్ధానికి సిద్ధం చెయ్యండి. ఎంతమందినైనా నేను నా గిట్టలతోనూ, కొమ్ములతోనూ చంపగలను. మీ అందరికీ స్వర్గసుఖాలు అందుబాటులోకి వస్తాయి.'' అని చెప్పి పంపేశాడు.

ఈ లోపల ఇంద్రుడు దిక్పాలకులను సమావేశపరచి, వారితో ఇలా అన్నాడు:

''రంభుడి కొడుకు మహిషుడు బ్రహ్మ వల్ల వరాలు పొందిన మదంతో యుద్ధానికి సేనలను సన్నద్ధం చేస్తూ, ప్రగల్భాలు పలుకుతున్నాడు. వాడు స్వర్గాన్ని జయిస్తాడట. మహిషుడికి సేవకుడివిగా ఉంటావో, యుద్ధమే చేస్తావో తేల్చుకోమని వాడి దూత వచ్చి చెప్పిపోయాడు. అందుచేత మనం ఏం చెయ్యాలో తేల్చండి. శత్రువు ఎంత బలవంతుడైనా క్షమించరాదు. జయాపజయాలు దైవాధీనమే అయినా ప్రయత్నం మానరాదు. సంధి చేయటం మంచిదే. కాని ఇలాటి దుర్మార్గుడితో సంధి విషమిస్తుంది. యుద్ధం చెయ్యాలన్నా మన బలాలూ, శత్రుబలాలూ సరిగా అంచనా వెయ్యవలసి

కుని తపస్సు చేసుకునే వాళ్ళ దగ్గిరా, ఇతరుల భార్యల దగ్గిరా చెల్లుతుంది! అంతేగాని, యుద్ధం చెయ్యటమంటే అప్సరలను పంపి తపోభంగం చేయించటమనుకున్నాడా? కోటిమంది ఇంద్రులు వచ్చినా చీల్చి, చెండాడుతాను! నముచిని చంపిన నమ్మక ద్రోహి! వాణ్ణి క్షమిస్తే బుద్ధిమంతులు సంతోషించరు. వీడే అనుకుంటే వీడికి తోడుగా ఉండే విష్ణువూ ఇలాటివాడే. మోసంతో పందిరూపంలో హిరణ్యాక్షుణ్ణీ, సింహం మనిషి రూపంలో హిరణ్యకశిపుణ్ణీ చంపాడు కాడా? ఇంద్రుణ్ణీ, విష్ణువునూ నమ్మటం ప్రమాదకరం,'' అన్నాడు.

వుంటుంది. అందుకు ఒక మనిషిని పంపుదాం.''

ఇంద్రుడు పంపిన దూత వెళ్లి త్వరగా తిరిగి వచ్చి, మహిషుడి బలాలను గురించి చెప్పేసరికి ఇంద్రుడు విస్మయం చెంది, తన పురోహితుణ్ణి, ''మహిషుడు అంతు లేని సేనలతో మన మీదికి యుద్ధానికి వస్తున్నాడు. ఏమిటి ఉపాయం?'' అని అడిగాడు.

ఇంద్రుడి కంగారు చూసి బృహస్పతి, ''అపాయం ఎదురైనప్పుడు ధైర్యం విడిచి పెట్టరాదు. ధైర్యంగా ఉండు. అయేది కాకుండా ఉండదు. అయినా శాయ శక్తులా ప్రయత్నం చెయ్యవలసిందే! అందుకే కదా మహర్షులు మోక్షం కోసం తపస్సు చేస్తారు? అచ్చగా దేవుణ్ణి నమ్ము కుంటే పని జరగదు. మనం ప్రయత్నం చేసినా ఫలితం కలగకపోతే అది దైవికం," అన్నాడు.

దానికి ఇంద్రుడు, ''దేవా, ప్రయ త్నించక పని జరగదు. యతులకు విజ్ఞా నమూ, బ్రాహ్మణులకు తృప్తీ ఎలాగో రాజులకు శత్రుసంహారం అలాగు. నువు అనుకూలంగా సలహా ఇస్తే, నేను యుద్ధ యత్నం చేస్తాను. నాకు నువూ, వజ్రా యుధమూ, హరిహరులూ సహాయులు,'' అన్నాడు.



బృహస్పతి ఇంద్రుడితో, ''నేను నిన్ను యుద్ధం చెయ్యమనిగాని, వద్దనిగాని సలహా చెప్పను. నన్ను మీరంతా మహా మేధావి అంటారు. కాని చంద్రుడు, నా భార్యను ఎత్తుకుపోతే నా తెలివితేటలు ఎందుకు పనికి వచ్చాయి? అందుచేత మీమీ బుద్ధికి తోచిన ఉపాయాలు ఆలో చించండి,'' అన్నాడు.

అప్పుడు ఇంద్రుడు బ్రహ్మను శరణు జొచ్చి, ''మహిషుడు అనేవాడు మదించి స్వర్గం మీదికి సైన్యంతో దండెత్తి వస్తు న్నాడు. వాడి నుంచి నాకు చాలా భయం కలుగుతున్నది. నా దురవస్థ చూడు!'' అన్నాడు.



యుద్ధం భయంకరంగా సాగింది. ఎంత శౌర్య పరాక్రమాలు ప్రదర్శించినా దిక్పాలకులూ, ఇంద్రుడూ, త్రిమూర్తులూ మహిషుడి ధాటికి తట్టుకోలేక చివరకు పారిపోయారు. స్వర్గం మహిషుడి వశమయింది. మహిషుడు ఇంద్రుడి ఆసనం మీద కూర్చుని, పదవులన్నిటా తన రాక్షసులను నిలిపి, దేవతల ధనాగారాలన్నీ స్వాధీనం చేసుకుని, స్వర్గసుఖాలు అనుభవిస్తూ పాలించసాగాడు. దేవతలు కొండలూ, గుట్టలూ పట్టిపోయి, అష్టకష్టాలూ పడ్డారు.

ఇలా కష్టాలు పడలేక దేవతలు ఒకసారి బ్రహ్మ కొలువుకు వెళ్లి, "ఒక్క మహిషాసురుడు మమ్మల్నందరినీ జయించి, మాకు ఇటువంటి దుస్థితి తెచ్చిపెట్టాడు గదా, తండ్రి వంటివాడివి, మా దుస్థితి ఎందుకు చూడవు? సర్వజ్ఞుడివి, మా గతి ఏమిటి?" అని వాపోయారు.

"నన్నేం చెయ్యమంటారు? వాడు తనను ఏ పురుషుడూ చంపకుండా వరం పొందాడు. వాణ్ణి చంపితే ఎవతె అయినా ఆడదే చంపాలి. మనం ముందు శివుడితోనూ, తరవాత విష్ణువుతోనూ ఆలోచింతాం," అన్నాడు బ్రహ్మ.

దేవతలందరూ బ్రహ్మ వెంట శివుడి వద్దకు వెళ్ళారు.

ఇంద్రుడి మాటలు విని బ్రహ్మ, "మనం శివుణ్ణీ, విష్ణువునూ వెంటబెట్టుకుని యుద్ధం చెయ్యటం మంచిది. ముందు కైలాసానికి పోదాం," అన్నాడు.

ఇద్దరూ కలిసి శివుడి వద్దకు వెళ్ళి సంగతి చెప్పారు. తరవాత ముగ్గురూ కలిసి విష్ణువు వద్దకు వెళ్ళారు. అందరూ కలిసి మహిషుడితో యుద్ధం చెయ్యటానికి నిర్ణయం జరిగింది. హంస మీద బ్రహ్మ, గరుత్మంతుడి పైన విష్ణువూ, ఎద్దు మీద శివుడూ, నెమలి మీద కుమారస్వామీ, ఏనుగు మీద ఇంద్రుడూ ఎక్కి యుద్ధానికి బయలుదేరారు. దేవసేనలూ, రాక్షససేనలూ ఒకదాన్ని ఒకటి ఎదుర్కొన్నాయి.

"ఏం పని మీద వచ్చారు?" అని శివుడు వారిని అడిగాడు.

"నీకు తెలీనిదేమున్నది? మహిషాసురుడు స్వర్గం ఆక్రమించి ఇంద్రుణ్ణీ, దేవతలనూ అష్టకష్టాలపాలు చేశాడు. వాళ్ళు తమ గతి ఏమిటని అడుగుతున్నారు," అన్నాడు బ్రహ్మ.

శివుడు చిరునవ్వు నవ్వి, "దేవతలకు ఈ అనర్థం కలిగించినది నువే కదా! నీ వరం వల్ల వాణ్ణి ఏ మగవాడూ చంపలేడు. మరి వాణ్ణి చంపటానికి ఏ ఆడదాన్ని పంపుదాం? నీ భార్యను పంపుతావా? నా భార్యను పంపనా? లేక ఇంద్రుడి భార్య పోతుందా? మన భార్యలలో ఒకతె కూడా యుద్ధం చెయ్యగలది కాదే! అందుచేత ఏం చేస్తే బాగుంటుందో విష్ణువును అడుగుదాం. అతను నాకన్న తెలివిగలవాడు," అన్నాడు.

అందరూ కలిసి విష్ణువు వద్దకు వెళ్లారు. వాళ్ళు వచ్చిన పని విని విష్ణువు, "మన మందరమూ మహిషుడితో యుద్ధం చేసి ఓడినవాళ్ళమే గదా! వాణ్ణి ఆడదే చంపాలంటే మన అందరి తేజస్సుతోనూ ఒక స్త్రీని తయారుచేసి, ఆమెకు మన ఆయుధాలిచ్చి, ఆమెచేత మహిషుడితో యుద్ధం చేయించాలి," అన్నాడు.

విష్ణువు ఇలా అంటూండగానే దేవతలందరి నుంచీ రకరకాల తేజస్సు వెలువడి, అది క్రమంగా ఏకమై, పద్దెనిమిది చేతులు గల స్త్రీ మూర్తిగా తయారయింది.



దేవతలు ఆమె చేతులలో తమ తమ ఆయుధాలు ఉంచారు.

ఆమె దేవతలతో, "భయపడకండి. ఆ రాక్షసుణ్ణి నేను చంపుతాను!" అంటూ సింహనాదం చేసింది.

దాన్ని విని మహిషుడు, "ఎవడు ఈ ధ్వని చేసినది? వెళ్ళి, వాణ్ణి పట్టి తీసుకు రండి! నా చేత చావుదెబ్బ తిన్న దేవతలకు ఇంత సాహసం ఉండదే!" అన్నాడు తన వాళ్ళతో.

వాళ్ళు వచ్చి మహాదేవి అవతారం చూసి బెదిరిపోయి, మహిషుడితో, "ఎవతో సింహం ఎక్కి వచ్చింది. ఒంటి నిండా ఆభరణాలు. పద్దెనిమిది చేతులలో ఆయుధాలు!" అని చెప్పారు.

మహిషుడు తన మంత్రితో, "ఎలాగైనా ఆ స్త్రీని తీసుకురా! నా పట్టమహిషిగా చేసుకుంటాను!" అన్నాడు.

మంత్రి వచ్చి, దూరంగా నిలబడి దేవితో, "అమ్మా, నువెవరు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? సర్వలోకపాలకుడు మహిషాసురుడు నిన్ను కోరుతున్నాడు," అన్నాడు.

దేవి చిన్నగా నవ్వి, "వాణ్ణి చంపటానికే వచ్చాను! నువు మంచివాడివిలా గున్నావు. నిన్ను చంపను. మీ ఏలికకు నేను వచ్చిన పని చెప్పు!" అన్నది.

మహిషుడు తన మంత్రి మాటలు నమ్మలేక, రాయబారానికి తన సేనాపతిని తామ్రుణ్ణి పంపాడు. దేవి వాణ్ణి చంపింది. అంతటితో మహిషుడి ప్రేమ ఘట్టం అంతమయింది. అతను దేవితో యుద్ధానికి తన సేనాపతులను పంపాడు. అందరూ దేవి చేత చచ్చారు. తరవాత మహిషుడే దేవిసంగతి తేల్చుకునేటందుకు వచ్చాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. మహిషుడు కామరూపి కావటంచేత, అనేక రూపాలు ధరించి దారుణ యుద్ధంచేశాడు. చివరకు దేవి వాణ్ణి చక్రాయుధంతో తల నరికి చంపేసింది.

దేవతలు పరమ సంతోషం పొంది, దేవిని స్తోత్రం చేశారు.






మాలతి, నందనా మంచి స్నేహితురాళ్లు. నందన తండ్రి పట్టణంలో వ్యాపారం ప్రారంభించటంవల్ల వాళ్ల కుటుంబం పట్నం వెళ్లిపోయింది. స్నేహితురాళ్లు విడిపోయేటప్పుడు, తప్పక పట్నం రమ్మని నందన మాలతికి మరీ మరీ చెప్పివెళ్లి, పట్నం వెళ్లాక తన చిరునామా కూడా మాలతికి రాసింది.

మళ్లీ నందనను కలుసుకోవాలనీ, పట్నం చూడాలనీ ఆత్రపడుతున్న మాలతికి ఒకనాడు పట్నం వెళ్ళే అవకాశం దొరికింది. ఆ ఊరి శ్రేష్ఠి ఒకాయన సొంత వ్యవహారం మీద పట్నం వెళుతూ, మాలతిని నందన ఇంటివద్ద దించటానికి ఒప్పుకున్నాడు. పట్నంచేరాక ఆ శ్రేష్ఠి ఆలస్యమవుతున్నదని, మాలతిని నందన ఇంటి సమీపంలోదించి, తన బండిని తోలించుకు పోయాడు.

మాలతి నందన ఇంటిని సులువుగానే కనుక్కున్నది. కాని నందన ఇల్లు తాళం పెట్టి ఉన్నది. మాలతి ఏం చెయ్యటానికీ తోచక, పక్క ఇంటికి వెళ్లి, లోపలికి తొంగి చూసింది.

ఆ ఇంటి ఆడమనిషి, నడివయసు స్త్రీ, ''ఎవరమ్మా? ఏం కావాలి?'' అని మాలతిని అడిగింది.

మాలతి ఆమెకు తన పరిస్థితి చెప్పుకుని, ''నందన ఎక్కడికి వెళ్ళింది? ఎప్పుడు వస్తుంది?'' అని అడిగింది.

''బంధువుల ఇంట పెళ్ళి అని, ఇంటిల్లిపాదీ పొరుగూరు వెళ్ళారు. చీకటిపడి వస్తారు. అందాకా మా ఇంట్లో ఉందువుగాని. ఈ పట్నంలో ఒంటరిగా ఎక్కడ ఉంటావు?'' అన్నదామె.

మాలతికి ప్రాణం లేచివచ్చింది. ముందు తెలియజేయకుండా ఎవరి

మాచిరాజు కామేశ్వరరావు



ఇంటికి వెళ్లకూడదని తన తండ్రి ఎప్పుడూ చెబుతాడు. అలా ఎందుకు చెబుతాడో మాలతికి ఇప్పుడు అర్థమయింది.

ఆ పొరుగింటి ఆవిడకు ఒక కూతురు ఉన్నది. పేరు జానకి. జానకికీ, మాలతికీ తేలికగా స్నేహం కుదిరింది. జానకి తండ్రికి ఉద్యోగం ఏమీ లేదు. పెద్ద ఆదాయం ఏమీ ఉన్నట్టులేదు; అయినా వారు ఎంతో మంచి హృదయంతో, ముక్కూ, మొహమూ ఎరగని తనను ఆదరించటం చూసి మాలతి ఎంతో ముచ్చటపడింది.

పగలు జానకి మాలతిని పట్నం అంతా తిప్పి చూపించింది.

ఆ సాయంత్రం జానకి స్నేహితురాలి పెళ్ళి విందు ఉన్నది. కనీసం జానకి అయినా వెళ్ళకపోతే బాగుండదు. కాని జానకి వెళ్ళటానికి బిడియపడింది.

"నేను వెళ్ళనమ్మా! ఆ పెళ్ళికి అంతా గొప్ప, గొప్పవాళ్ళు వస్తారు. కట్టుకోవటానికి మంచి చీరలేదు; మెడ, చేతులూ బోసిగాపెట్టుకుని నేను విందుకు వెళ్ళానంటే, మిగిలినవాళ్ళ మధ్య పని మనిషిలాగుంటాను! నేను వెళ్ళనులే!" అన్నది జానకి తన తల్లితో.

ఈ మాట వినగానే మాలతి జానకికి తన పెట్టె నుంచి పట్టుచీర తీసి ఇచ్చి, తన నగలుపెట్టి, "ఇక పెళ్ళివిందుకు వెళ్ళిరా!" అన్నది.

జానకి అభ్యంతరం చెప్పకుండా విందుకు వెళ్ళింది.

చీకటి పడింది, పొద్దు పోయింది. పెళ్ళికి వెళ్లిన నందన వాళ్ళకుటుంబం రాలేదు. విందుకు పోయిన జానకీ తిరిగి రాలేదు. జానకిని తీసుకు వస్తానని బయలుదేరిన తండ్రి, గుమ్మంలో పడిఉన్న కాగితం తీసి చదివి, వెర్రికేక వేశాడు.

మాలతి చప్పున వెళ్లి, ఆయన చేతి నుంచి కాగితం తీసుకుని చదివింది. అది జానకి తన తల్లికి రాసిన ఉత్తరం. అందులో ఇలా ఉన్నది:

"అమ్మా, నగలు ఆడదానికి శత్రువు లని ఈ రోజే తెలిసింది. ఏందు నుంచి వస్తూంటే, సందులో నలుగురు మనుషులు కత్తి చూపించి, నగలన్నీ ఒలుచుకుపోయారు. మాలతికి నా మొహం ఎలా చూపించేది? పరాయి సొమ్ము పెట్టుకున్నందుకు నాన్న నా గొంతు నులిమేస్తారు! అందుకే వెళ్లిపోతున్నాను. నా కోసం వెతకవద్దు."

మాలతి కళ్ళ వెంట నీళ్ళు తిరిగాయి. జానకి ఎక్కడికి వెళ్ళి ఉంటుంది? ఏదైనా అఘాయిత్యం చెయ్యదు గద? నగలకన్న ప్రాణాలు విలువైనవి కదా!

ఉత్తరం చదివి జానకి తల్లి శోకాలు ఆరంభించింది.

జానకి తండ్రి మాలతితో, "అమ్మా, కాలక్రమాన నీ నగల ఖరీదు ఇచ్చు కుంటాను. జానకిని వెతికించే ప్రయత్నం నేను చెయ్యలేను. నా దగ్గిర చిల్లిగవ్వ లేదు," అని కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

"బాబుగారూ, నా నగలడబ్బు మీ రియ్యనవసరంలేదు. ముందు జానకిని వెతకడానికి మనుషులను పంపండి. నిన్న రాత్రి మీరు ఆశ్రయం ఇయ్యకపోతే, దొంగలు నా మెడనుంచే నగలు కాజేసే వాళ్ళేమో!" అన్నది మాలతి.

జానకి తండ్రి జానకిని వెతకటానికి చీకట్లో పడి పోయాడు.

కాస్సేపటికి వీధిలో బండి ఆగిన శబ్ద మయింది. మాలతీ, జానకి తల్లీ ఆత్రంగా





బయటికి వచ్చారు. నందన కుటుంబం వారంతా బండిలోనుంచి దిగారు.

పక్కగుమ్మంలో నిలిచిఉన్న మాలతిని చూడగానే నందన ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ వచ్చి కౌగలించుకున్నది. తరవాత మాలతి ఆమె వెంట తన పెట్టెతోసహా వారి ఇంటికి మారింది.

మాలతి లోపలికి రాగానే నందన, "ముందు నీ పెట్టె తెరిచి, సామానంతా ఉందో, లేదో చూసుకో! నీకు ఆ దొంగల ముఠాయే దొరికిందా?" అన్నది.

మాలతి నిర్ఘాంతపోయి, నందనకు జరిగినదంతా చెప్పి, "నువు పొరబడు తున్నావు. వాళ్ళు చాలా మంచివాళ్ళు. పాపం, నా మూలంగా జానకి ఎటో వెళ్ళి పోయింది!" అన్నది బాధగా.

నందన కటువుగా, "ఎక్కడికీ పోదు! నిక్షేపంగా వాళ్ళ బంధువుల ఇంట ఉండి ఉంటుంది. ఇదంతా నాటకం! పట్నం మోసాలసంగతి నీకింకా తెలీదు. మెత్తగానే గొంతులు కోస్తారు. ముఖ్యంగా వీళ్ళను గురించి చుట్టుపక్కల అందరికీ తెలుసు. ఏ మాత్రం ఏ మరుపాటుగా ఉన్నా, గుడ్డలూ, గిన్నెలూ కాజేస్తారు. వీళ్ళపోరు భరించలేకుండా ఉన్నాం! దొంగలు నిలువు దోపిడీచేసిన జానకికి ఉత్తరం రాయటానికి కలమూ, కాగితమూ ఎక్కడి నుంచి వచ్చి ఉంటుందా అని నువు ఆలోచించావా? తేలికగా మోస పోవటానికి వీళ్ళకు నువు దొరికావు!" అన్నది.

మాలతికి మండి పోయింది.

"నేను పల్లెటూరిదాన్ని కావచ్చు గాని, ఈ పట్నం మోసగాళ్ళ ఆటలు కట్టించలేక పోను! నాకు నీ సహాయం మటుకు కావాలి!" అంటూ ఆమె నందన చెవిలో ఏదో చెప్పింది.

"తెలివైనదానివే! నీ ఎత్తు పారటానికి పెళ్లి నుంచి మా వెంట వచ్చిన మా పిన్ని కొడుకు సహాయపడతాడు. వాడు నాట కాలరాయుడే లే!" అన్నది నందన.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.







Ravindra S. Kamboj

Prabu Sankar

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మలిచిందొక హస్తం

రెండవ ఫోటో : వెలిసిందొక శిల్పం

పంపినవారు : కుమారి ఎం. ఉమాలక్ష్మి, టెంపుల్ స్ట్రీట్, విజయనగరం.

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

# శత్రు సంహారం!































కార్బొలిక్ ఏసిడ్ గ్రూప్ ఫార్ములా— పళ్ళ ఎనామిల్‌ను నష్టపరిచి, బాధను కలిగించే పిప్పి పళ్ళను కలిగించేది.

గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా నిరోధించడంకోసం—బినాకా ఫ్లోరైడ్.

# ...ట్రిరింగ్... రింగ్!



## ...హా-రావు స్కూలుకు కొత్త ఎర్ర సైకిల్లో వెళతాడు

...స్కూలుకు ఆరే మొదటి రోజు.
...గాడండి మరి! గుండ్రంగా
ఆ చుట్టూ, ట్రింగ్....



...గొర్రి
కొడతాడు.

"అబ్బ, ఎం....త
బావుందో ఆ సైకిలు!"
అంటాడు జయిూకరావు
కళ్ళనిండా నీళ్ళతో.









"అహా . నేనివ్వనంటే ఇవ్వను" అని
అరుస్తాడు ఆదా-రావు.
"ఇది నా కొత్త ఎర్ర సైకిలు
నేను తప్ప ఎవ్వరూ తొక్కకూడదు
ఇది నా డబ్బుతో కొన్నది
కష్టించి ఆదాచేసి కొన్నది"

అప్పటికే కాకమ్మ చిరచిరలాడిపోతోంది.

కా...కా...కా...

ఏం చేస్తే ఆదా-రావు
ఆ సైకిలు దిగుతాడు,
మిగతా వాళ్ళు ఎక్కి తొక్కుతారు?
"రండొసే, రండెహే!" అమె
...మిగతా వాళ్ళకి చెబుతుంది. అందరూ ఆ పథకాన్ని
...మలులో పెట్టేందుకు సిద్ధమౌతారు.



వాళ్ళు అనుకున్నది ఇది:

... ఆదా-రావుని తరుముతారు.
ఆదా-రావు ఆ చివరికి చేరుకోగానే, మన
కాకమ్మ కేక వేస్తుంది.
అప్పుడు పొట్టయ్య దారికడ్డంగా
నిలబడతాడు. గార్ధభయ్య
ఓ తాపు తంతాడు! అంతే. అతను దొర్లి
పడతాడు. ఆ సైకిలు వాళ్ళదేగా మరి!

కానీ; ఏం జరిగిందో తెలుసా!






ఆదా-రావుని గంటన్న తరమడం ప్రారంభించగానే, అతను తన కొత్త ఎర్ర సైకిల్లో
జామ్మని వెళ్ళిపోయాడు. మిగతా వాళ్ళు అనుకున్న దానికంటే వేగంగా! కన్నుమూసి తెరిచేలోగా!

చిలక తాత ఇదంతా తన చెట్టుపై
నుంచి చూస్తున్నాడు. ఓ కన్ను
తెరిచి ఇలా అన్నాడు.

పిల్లలూ, రండి.
మీ డబ్బు ఆదా చెయ్యండి
మరింత మజా చెయ్యండి.

# పిల్లల్నేమో లాలించాలి, లాలిస్తే ఏపుగా పెరుగు




## ప్రీతితో యిచ్చేది పార్లే గ్లూకో మజా రుచితో ఎంతో శక్తితో

పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్ మజా రుచులతో నిండి, పుష్టి నిచ్చే లక్షణాలు గలది.

పార్లే గ్లూకో

భారతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్



వరల్డ్ సెలక్షన్ బహుమతిని గెలుచుకున్నది